# గాంధి - గారడీ



ముదిగంటి జగ్గన్న శాస్త్రి, బి. ఏ.



పల్లెటూరు గ్రంథమండలి - తణుకు
ప॥ గో॥ జిల్లా

# విషయసూచిక

పేజీ

Gottipaty Brahmayya
Chairman

Raghava Sadan
6-3-1248 Somaji Guda
Hyderabad-4
Date 18-3-66




తాము పంపిన "గాంధీ-గారడి" చదివాను. అందులో విషయములు చాలవరకు 1920 నుండి మీకు సహచరుడుగా వున్న నాకు తెలిసినవే. అయినా తిరిగి జ్ఞాపకంచేసుకుని మిక్కిలిగా ఆనందించాను. నేడు కార్యరంగమున గల కార్యకర్తలకు గాని, పెద్ద పిన్నలకు గాని యీ విషయాలు ఆమూలాగ్రంగా తెలుసుకొనవలసిన ఆవశ్యకత యెంతయోకలదు. మహాత్ముడు భారతదేశ కాంగ్రెసు నాయకత్వము వహించకపూర్వమే దేశభక్తుడుగ, ఆధ్యాత్మిక వేత్తగ, రాజకీయచతురుడుగ, ప్రజాసేవకుడుగ, అమూల్యమైన సేవజేస్తూ భారతజాతిని త్యాగపథానికి ఆయత్తంజేసిన సంఘటనలెన్నో మీరు అతిసులభమైన భాషలో, చదువుటకు ప్రారంభించినది లగాయతు, ఆఖరయ్యేవరకు చాల ఉత్కంఠతతో, ఆప్యాయతతో చదువుకునే రీతిని వ్రాసినందులకు మిమ్ములను నేను మిక్కిలిగ అభినందిస్తున్నాను.

1916 మీ విద్యార్థిదశనుండి దేశభక్తులుగ మిమ్ములను మీరు తీర్చిదిద్దుకుని, అకుంఠిత సేవాదీక్షతో అనేక కష్టనష్టములకు గురియై స్వరాజ్య సంపాదనకు, స్వరాష్ట్ర సంపాదనకు మీరు చేసిన ఎనలేని త్యాగానికితోడు, పల్లెటూరు గ్రంథ మండలిని స్థాపించి లెక్కకు మిక్కిలి గ్రంథాలను రచియించి, భాషాసేవ చేస్తూ యెంతోమంది యువకులను దేశభక్తులుగ తీర్చిదిద్దుతున్న మీకు, నేను నమ్రతతో అభినందనలు తెలుపుచున్నాను.

మానవోత్తముడు, పూర్ణపురుషుడు అయిన మహాత్ముడు మనకు మహాసేనాని, ఆయన నాయకత్వమున జరిగిన సాత్విక నిరోధము, అసహాయోద్యమం, సత్యాగ్రహం, శాసనోల్లంఘున, క్విట్ ఇండియా వగైరా సంరంభముల పూర్తి చరిత్ర, స్వరాజ్యసంసిద్ధి వరకు, మరొక సంపుటి త్వరలో మీరు వెలువరించగలరని ఆశిస్తున్నాను.

భవదీయుడు,

(Sd) గొట్టిపాటి బ్రహ్మయ్య

K. Brahmananda Reddy
Chief Minister

Hyderabad
6th April 1966

గాంధి-గారడీ యను మన స్వాతంత్ర సమరగాధ మొదటి భాగము చదివి పులకితగాత్రుడనగుచు పుస్తకము తెరచినది మొదలు చివర వరకు నన్ను పరుగెత్తించిన భాష, భావనా పటిమ, యితిహాసరసస్రవంతి, వీరభయానక రౌద్ర, అట్టహాస, కరుణాది నవరసయుక్త గాధ వినుచు నేటి మానవహనన కాండతో కూడిన ప్రపంచ చరిత్రను మాత్రమే చూడగల విషయ విజ్ఞానమ్మన్యులకు, మన స్వాతంత్రచరిత్రలో గల గంభీరత నెరుగని పసికందులకు నిది 'స్వాప్నోను, మాయోను, మతిభ్రమోను' అనిపించుటలో నాకాశ్చర్యమేమియు కలుగుటలేదు. ఈ యపూర్వచరిత్రలో పాత్ర వహించిన ప్రఖ్యాత పురుషులే కొందరు దీని మహిమను మరచి విహరించునపుడు నేటి నవయువకులు దీనిని నమ్మకపోయినను నాకాశ్చర్యమేమి? ప్రపంచచరిత్రనంతను ఆపోశనము పట్టిన మన ప్రథమ ప్రధాని జవహరుపండితు డిది గ్రహించియే గాంధీజీని 'గారడీడు' అని వర్ణించియుండెనేమో! ప్రపంచ ప్రఖ్యాతి వహించిన శాస్త్రవేత్త 'ఐన్‌స్టీన్' గాంధీ వంటి

వ్యక్తి యీ లోకమున నుద్భవించెనా యని ప్రశ్నించు రోజులు వచ్చునని చాటి యుండలేదా!

ఈ యమరగాథను, సత్య చరిత్రను, కండ్లకుకట్టినట్లు నడిపించిన శాస్త్రిగారి కలము నెట్లు వర్ణింపదగును! ఇంకను యిరువదియేడువత్సరముల వీరచరిత్రతో స్వాతంత్ర్యసిద్ధి వరకు మనల నురికించి యీ నవభారతశక్తి కొక యమర స్థాయిని కల్పించి ప్రపంచ శాంతికి మన జాతిపిత నడిపించిన యపూర్వ రాజకీయచరిత్ర యెట్లు మార్గదర్శకమైనది శాస్త్రి గారు త్వరలో మరియొకటి రెండు భాగములలో వెలువరింప గలరని యాశించుచున్నాను.

(Sd) కాసు బ్రహ్మానందరెడ్డి

# తొలిపలుకు

భారతదేశ మతి పురాణదేశము. దాని నాగరికత, చరిత్ర, విజ్ఞానము, శాస్త్రపురాణేతిహాసములు, కళలు, విద్యలు మొదలగు మానవ, మానవేతర సంపాదితార్థము లన్నియు నతి ప్రాచీనములు. చరిత్రగల నేటి ప్రపంచదేశ చరిత్రల నన్నింటిని త్రవ్వికొనుచుపోయినచో నే దేశము నెరుగని ప్రాచీనత మన దేశమునకు గలదనుటలో నతిశయోక్తి లేదు.

ఈ దేశపు మట్టి, నదీనదములు, పర్వతపంక్తులు, ఖనిజములు, గుహాగహనాదులు ప్రాచీనతనే చాటుచున్నవి. ప్రపంచములో ననేక నాగరికతలు, సభ్యతలు పుట్టి గిట్టినవి. కొన్ని నామరూపములుకాని యానవాళ్లుకాని లేక భూగర్భములో శరణుజొచ్చినవి. భారత సభ్యతాప్రవాహము మాత్రమింకిపోలేదు. ఇంకదు. ఇంకనిగుణమందులో నొకటి కలదు.

అయినను భారతసభ్యతకూడ ననేక దాడులకు గురియయ్యెను. అది యనేక యుగాంతరములను తరించెను. అనేక రాచకీయ ఝంఝూమారుతముల ననుభవించెను. అది మధ్యయుగ, అధునాతన యార్థిక, సాంఘిక, వైజ్ఞానిక విప్లవములచే తబ్బిబ్బుచెందెను. ఇంకను చెందుచున్నది.

స్తబ్ధత్వము, విస్మృతి, పరాభవము, దుర్బలత్వము, పారార్థ్యము, నైరాశ్యము, అనుకరణ, దాస్యము లావరించి భారతవ్యవస్థ ఛిన్నాభిన్నమై, పసచెడి శల్యమాత్రావశిష్టముగనుండెను.

కాని యీ సీమలో మానవజీవితానుభవ దివ్యకవాటము లెప్పుడును తెరువబడియేయుండెను. అంతేకాదు, దైవమే దిగివచ్చి యీ సీమలో మానవునితో వియ్యము, కయ్యము, స్నేహబాంధవ్యములను నెరపుచు పనితీరిన వెనుక నంత హితతమగుచుండును. నిజమేమన యీ సీమ, యీ గెడ్డ పదార్థవిజ్ఞానముతోను, విషయసంపదతోను, పర్వత, లోహ, వృత్తి పశుధనధాన్య భాగ్యభోగ్యములతోను, కళా, విజ్ఞాన గరిమలతోను నెంతగా తులతూగినను వాని యస్థిరత్వము, దోషము, అసంపూర్ణత గుర్తింపకపోలేదు. ఇతర నాగరికతలకీ దృష్టిలోపించెనని చెప్పవచ్చును.

వస్తుసంపదకంటె మానవసంపదయే యనేక మడుంగులు ముఖ్యమనియు, మానవసంపదకవిరోధభావముతో నున్నంత కాలమే విషయసంపద కాస్కారము కలదనియు మానవుడు, మానవత్వము తృణీకరింపబడిననాడు రాజకీయ, సాంఘిక, ఆర్థికవిప్లవములుప్పతిల్లుననియు నట్టిప్రపంచము స్తవ్యస్తమై మానసిక యరాచకమేర్పడి యల్లకల్లోలముల పాలగుననియు మానవచరిత్ర చాటుచున్నది. ఈ రహస్యమును భారత

సభ్యత యెన్నడో గుర్తించి యల్పబుద్ధిగల మానవుడు దీనిని విస్మరించుననని పర్వతశిఖరములనుండి, నదీగర్భములనుండి, రోదోంతరాళములనుండి మానవలోకమునకు వినబడునట్లు ప్రచారము చేసియుండెను.

కాని నేటి ప్రపంచమున కొకదుర్గతిపట్టెను. 19,20 శతాబ్దములు బొగ్గు, యినుము, ఆవిరి, మట్టితైలము మొదలగు సంపదను వాటితో తయారైన యంత్రసంపదను మాత్రమే గుర్తించి వాటి ప్రభావమునే పెంపొందించెను. ఈ యంత్రబలముతో వీరవిహారము చేసెను; చేయుచున్నది. యంత్రబలముతో మితిలేని ద్రవ్యము, గతిలేని వస్తుసంపద, గమాగమన సౌకర్యములు, భోగవిలాసములు, రోగకలాపములు, మానవవిలాసములు, భావవికారములు పెచ్చుపెరిగి మానవత్వము నేలమట్టమునకు తేబడెను. బొగ్గు, యినుము యంత్రముతో ప్రారంభమైన యీ సంపద చివరకు ఆటంబాంబులోనికిదిగెను. నేడు యీ బాంబును సంపాదించిన దేశమే దేశము. ఇది లేని దేశము దేశముకాదు. అందుల్లోని మానవులు మానవులుకారు. కనుక వీటికొరకు పరుగులు ప్రారంభమయ్యెను. ఇవి కాళ్లతో పరుగులుకావు కారులతోను, విమానములతోనూ పరుగులు. ఇందులో ముందు పరుగిడిన వాడు ఘనుడు, ముందు పరుగిడిన దేశము గొప్పది. దానికే పూజ్యత. దానిదే నాగరికత. దానిదే రాజ్యము,

దాని మాటే పైమాట. దానిపాఠమే వరవడి. దాని పలుకే చలామణి.

ఈ పరుగులలోను, వరవళ్ళలోను నెంతమంది మానవులతలలు చూర్ణముగావింపబడినను తగవులేదు. తప్పులేదు. ఎంతరక్తము ప్రవహింప చేయబడినను దోషములేదు, ధనముకొరకు మానవుని యింధనముగా నుపయోగించుకొనవచ్చును. ఫిరంగికి మానవుడేమేత. ఈ యంత్రనాగరికతకు మానవుడడ్డముగనున్నచో వానిమీదుగా పోవచ్చును. అర్థమే పరమార్థము. గమ్యము, మోక్షము.

అర్థమునకు నీతితో ప్రసక్తి లేదు, జాతితో నిమిత్తము లేదు, 'నీ జేబులను నిరంతరము ధనముతో నింపవోయి' అను పాత్ర షేక్స్పియరుకవి నాటకములలో కలదు. అతని కింకొక చింతపనికిరాదు. నేటి ప్రపంచమున కితడే క్షేత్రపాలుడు. ధనము! ఎక్కువ ధనము, మరింత ధనము. యంత్రము భారీయంత్రము. మరీభారీయంత్రము. భోగము. అమిత భోగము.

రెండుశతాబ్దములుగ నీతత్త్వము విజృంభించి నేల నాలుగు చెరగుల వ్యాపించెను. ఇదిక్రమముగా భారతదేశమునకు గూడా ప్రాకెను. బానిసభారతము, స్బ్థ భారతము దీనిచే నాకర్షింపబడెను. జయింపబడెను.

ఇట్టివిషమ సమయమున శిబి దధీచి మొదలగు త్యాగచక్రవర్తులకు, నలహరిశ్చంద్రాది నిత్యసత్యనిరతులకు, ప్రహ్లాద

యుద్ధవాది మహాభక్తులకు నిలయమైన యీ పుణ్యభూమిలో, విశ్వరక్షణసేయు జ్ఞానగనియైన ఋషిదేశములో, గోపాలబాలు డుదయించిన రాష్ట్రములో సుదామపురి (పోర్బందరు)లో కృషి గోరక్షణాదులు స్వభావధర్మములుగ వరలిన వైశ్య కుటుంబములో 1969 అక్టోబరు రెండవ తేదీని జన్మించిన యొక బిక్క మోసిసి యీ యంత్రనాగరికతపై పాదాంగుష్ఠము మోపి, 'చాలు, చాలు నీ విజృంభణము నిక కట్టిపెట్టుము' అని కేలెత్తి శాసించెను.

వర్తకజాతి యని పేర్గాంచి దానితో రాజ్యకాంక్షను కూడ జోడించి భారతదేశము నాక్రమించి ' రవియస్తమింపని సామ్రాజ్యము ' గవిక్రమించిన బ్రిటిషు కేసరి కేసరములను ఝాడించి భారతసరిహద్దులు దాటించి లంకాప్రవేశము చేయించిన దీమహాత్ముడే. ఇతని వీరగాథనే నేను కనినంత వినినంత తెలియవచ్చినంత ఆంధ్రపాఠక లోకమునకు శృతి పరుపబూనితిని.

ఈ పుస్తకమున కేపేరు పెట్టెదరు? అని మాజీమధ్యరాష్ట్ర గవర్నరు శ్రీపట్టాభి శీతారామయ్యగారు నన్ను ప్రశ్నించిరి. హరిజనులను శాశ్వతముగవిడదీసి వారికి ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరచుటకు 1932 లో రామ్సే మాక్డొనాల్డ్ క పన్నాగము పన్నెను. దీనిని ప్రతిఘటించుటకు మహాత్ముడు ప్రాయోపవేశ దీక్షబూనెను. ఈ వార్త నేటి మనభారత

ప్రధానమంత్రి జవహారుపండితునకు మానసిక సంక్షోభమును చిత్తవైక్లబ్యమును కలిగించెను. అతనిలో నెన్నియో విపరీత భావములు మహాత్ముని దర్శనమిక తనకు దక్కదను చింత పెల్లుబికెను. ఇంతలోనే యీ యుద్యమము యావద్భారత తము నాకర్షించుట. సర్వపత్, సర్వమత సమస్యయగుట చివరకు శాంతిచేకూరుటవి) "ప్రజలను త్తేజపరచుటలో నితనికెట్టి యద్భుతశక్తి కలదు! ...ఎరవాడ జయిలులో కూర్చొని మంత్రించిన యీ బక్కమనిషి, యీ వామన మూర్తి యెంతటి 'గారడీడు' అని తనఆత్మకథలో జవహారు పండితుడు వ్రాసినఘట్టమును తలంచి దీనికాశీర్షికనే నిర్ణయించితిని.

# గాంధి - గారడీ

## పూర్వశతాబ్ది సింహావలోకనము

మన మాతృదేశము 'భారత' మనిపురాణ ప్రసిద్ధిగాంచిన సువిశాలదేశము. దక్షిణమున కన్యాకుమారి యుత్తరమున హిమాద్రి, పశ్చిమమున రత్నాకరము తూర్పున బంగాళా ఖాతము 1900 మైళ్ళపొడవు 1500 మైళ్ళువెడల్పు గలిగి ప్రపంచములోని భగభగమండు మండు విసరములు మొదలు యుత్తరధృవ హిమములవంటి హిమరాజముతో విరాజిల్లు సీతాచలమువరకుగల సమస్తసీతోష్ణపరిస్థితుల ననుభవించుచు నెచ్చట లేని వర్షము వర్షాభావము కూడ రుచి చూచుచు నిప్పచ్చరమగు రాజపుటానాయెడారి మొదలు సర్వసస్యఫలభరితములగు గంగా, గోదావరి, బ్రహ్మపుత్ర కృష్ణా, కావేరీ స్రవంతులయైశ్వర్యము ననుభవించుచు కర్మభూమి, ఋషులభూమి, యనునామములతో స్వర్ణభూమి వసుంధర, రత్నగర్భయను కీర్తిని కూడ గడించిన దేశము. ప్రకృతి యీ దేశముపట్ల పక్షపాతము వహించెనా యను నంతటి కన్నెర్రగా ప్రపంచమునాకర్షించిన దేశము.

కనుకనే పదిహేడవశతాబ్దములో ఒలాందులు, పరాసులు, ఆంగ్లేయులు, బుడతకీచులు రాజులుగాగాక, వర్తకులుగా మాత్రమే యీదేశమువచ్చి మనరాజుల నాశ్రయించి, ప్రార్థించి, తమసరకుల కొరకు వర్తక స్థావరములను వేడుకొని తలదాచుకొనుటకే ప్రాధేయపడిరి.

వీరు వర్తకము పేరిటవచ్చి దేశములోని యనైక్యత రాజకీయ నిర్వీర్యత, అవ్యవస్థకారణముగా రాజుల మధ్య శేక్తిన యీర్ష్యాసూయాదుల నూతగాగొని ద్వేషములను రగుల్కొలిపి పక్షములు వహించి తమతమ దేశముల నుండి సుశిక్షితులైన సైనికులను తెప్పించి రాజులచే రాజుల నోడించి దేశములోని సమస్తము నొల్లుకొని తమలో తాము కలహించుకొని చివరకు ఆంగ్లేయులు దేశపాలకులైరి.

వీరీ దేశము బీదదేశమని, తామసదేశమని. యనాగరిక దేశమని వీరి మోటుతనమును మకాఢ్యమును పోగొట్టి నాగరికులను చేయుటకే తామిక్కడకు విచ్చేసితిమని ప్రపంచమునకు చాటి కపటరాజకీయ నాటకమును ప్రారంభించిరి. ఈపైపలుకులు ప్రాచీన భారతమునకు చెందవు. రఘు, పాండవ శిబి దధీచి యిత్యాది పూర్వపురుషులు చరిత్ర యుగమున కందనివారు. ఆధునిక చరిత్ర యీప్రాచీనులను తనగర్భమున నిముడ్చుకొనజాలని మరుగుజ్జుచరిత్ర. కానిచరిత్ర యుగము నాటి భోజ, విక్రమార్క, అశోక, చంద్రగుప్త, శ్రీకృష్ణ

దేవరాయాదులు, అమరావతి, యుజ్జయిని, తక్షశిల, ధాన్య కటకము, హంపీ విజయనగరము మొదలగు మచ్చుతునకలు పెక్కులీదేశములో కలవు. కనుక పాశ్చాత్యులు వర్ణించిన భారత దేశవర్ణనలు కేవలము కల్లలు, కపటములు, బోకరింపులు, మసిపూతలు. మనవ్యావసాయిక, కుటీర నాగరికత సెలయేటి శీకరచ్ఛాయలందు పొడవదగిన నాగరికత. మానవగరిమను, మానుషీధనమును గుర్తెరిగిన నాగరికత యున్నంత కాలము, గౌరవింపబడినంత కాలము భారతీయుల యైశ్వర్యమునకు కొరతలేకయే యుండెను. ఇది పదునారు, పదిహేడవ శతాబ్దము వరకు కొంచెమించుమించు సాగుచు వచ్చెను. ఇంతవరకు భారత దేశములో నైశ్వర్యమునకు కొరతలేదు. అప్పటికి విద్యుత్తులు లేవు. అయోమార్గ గమాగమన సౌకర్యములులేవు. దూర శ్రవణ, దూరదర్శన, జలాంతర్గమన, ఆకాశగమనాది సౌకర్యములులేవు. కాని ప్రజలు రోగములులేక నూరేండ్లు సుఖముగ జీవించుట, దేహ,మనోదార్ఢ్యములు, శరీరపుష్టి, హృద్యమగు నాహారము, తృణకాష్ఠజలసమృద్ధి, మనస్తుష్టి, మానవ వికాసము, శాస్త్రకళాభివృద్ధి కలిగి యుండెడివారు దైహిక మానసికరోగముల నెరుగక చిరంజీవులుగ నుండెడివారు.

తొమ్మిదవ శతాబ్దములో భారతదేశములో నూతన శకమారంభమయ్యెనని చెప్పవచ్చును. ఇదిప్రపంచములోనే

యొకనూతనశకము తెచ్చిపెట్టెను. కానియూరపు ఖండముల కిది స్వేచ్ఛను, అధికారమును, ఐశ్వర్యమును, రాజ్యములను ప్రసాదించెను. భారతఖండమున కిది రాజకీయదాస్యమును, యంత్ర దాస్యమును, దారిద్ర్యమును, అజ్ఞానమును, దుర్బలత్వమును ప్రసాదించెను. స్వతంత్రము పోయి పారతంత్ర్యమబ్బెను. దేశములోని వెండిబంగారములు, రత్నరాసులు తరలింపబడెను. కోహినూరులు మయూర సింహాసనములు మాయమయ్యెను.

తొమ్మిది పదిశతాబ్దముల నుండియే ఈ దేశము విదేశీయుల దాడులకుగురియై మహమ్మదీయుల పాలనక్రిందకువచ్చి బ్రిటిషుపరిపాలన వచ్చువరకు కేంద్రము అనగా ఢిల్లీప్రభుత్వము మహమ్మదీయుల హస్తగతమయ్యెను. కానివారిచ్చటనే స్థిరనివాసర మేర్పరచుకొని రాజులలో రాజులై వర్తకులలో వర్తకులై కృషీవలులలో కృషీవలులై ప్రజలలోప్రజలై మనుచుండిరి. ఈకాలములో దేశములోని యార్థికవ్యవస్థ యంతగా మారలేదు. గ్రామసీమలు, కుటీరపరిశ్రమలు చెక్కుచెదరలేదు. విద్యలు కళలు అడుగంటలేదు. సరికదా వారిపోషణలోనవి పెంపుచెందెను. హిందూ మహమ్మదీయ సభ్యతల సమన్వయ సిద్ధికొరకు ప్రయత్నములుకూడ జరుగుచు వేయివత్సరము లీరెండు సంఘములు కలిసి జీవింపగలిగెను. ఇక పదునెనిమిదవ శతాబ్దానంతర కథ విపరీతపు కథయయ్యెను. వర్తకులుగా కాలిడిన తెల్లవారు కొద్దిపాటి

స్థాయి చిక్కగనే నూదివైయెవచ్చి దబ్బనముగ బలపడి రాజు లైరి. దేశములో బలమైన కేంద్రప్రభుత్వము లేదు ప్రజలలో రాజకీయ విజ్ఞత లేదు. రాజులు దేశభక్తిశూన్యులై తమతగవుల కొరకు దేశమునమ్మివేసిరి. ప్రజ లసహాయులైరి వారిలో జాతీయత నిర్వాణమై యుండెను. భారత దేశములో కొల్లగొట్టబడిన ధనముతో యింగ్లండు ప్రపంచ రాజ్యములలో ప్రథమ శ్రేణికిరాగలిగెను. ఇంతలో యంత్రశకమందుకొనెను. సముద్ర వర్తకములో స్వేచ్ఛ ననుభవించుచు ప్రాచీన దేశములలోని ధనమును తరలించుకొనిపోయిన, 'యాంగ్లనవాబులకు' ఆవిరియంత్రములు, అయోమార్గములు, వాయువిమానములు లెక్కలేనంత సహాయపడెను రెండు వందలసంవత్సరములలో భారత దేశములోని సమస్తము యింగ్లండు కరణమై పోయెను.

ఈ రాజకీయ దాస్యమువలన సమస్తము తారుమారయ్యెను. పూర్వపురూపమే మారిపోయెను. పూర్వపుపరిశ్రమలు, పూర్వపుటర్థసంపద, పౌరుషప్రతాపములు, గ్రామసీమలు, వివిధవృత్తులు, స్వతంత్రభావములు బలిమిని పసచెడి, బెండువడి నిర్వీర్యములై పోయెను. పాతప్రపంచము పోయెను. క్రొత్త ప్రపంచములో నీదుటకా స్వేచ్ఛ లేదు. రాజకీయాధికారము తెల్లవారి వశమైపోయెను.

ఈ క్రొత్త ప్రపంచములో నిక యింగ్లండు కోరికీదులాడు స్వేచ్ఛమాత్రమే మిగిలెను. ఇంగ్లీషువాని కొరకే బట్టకట్టు కొనవలెను. అతనికొరకే యింగ్లీషుచదువవలెను. వర్తకము

వానిలాభము కొరకే జరుగవలెను. ఇంగ్లీషురాజ్యమును నిలుపుటకే నౌకరీ చేయవలెను. పైగా 'దేశీయుద్యోగము' అను పెద్దకీర్తియైనపదము. హోదైన నడక, దొరగారి వేషము, ఇంగ్లీషువర్తకుల లాభము కొరకే శాసనములు; నాణెముల గారడీ జరుగుచుండవలెను. ఈ విపరీతపరిస్థితి నాపగల దాతలెవరును లేక దేశము కుయ్యాలించువారు లేక నిలువు దోపిడి చేయబడుచుండెను. మిసిమిమీగడలతోను, పసిడి పళ్లెరములతోను తులతూగిన యీ దేశము చివరకు డిగ్బీ (ఇంగ్లీషు బుధ కొరి) రుజువుపరచినట్లు, నిరంతర క్షామములకు రోగములకు నాటపట్టయ్యెను. ప్రతియిరువదేండ్లకు పదేండ్లకు కూడ కరువులు తలయెత్తుచు లక్షలకొలది జనులను పొట్ట బెట్టుకొనుచుండెను. రోము, పరిష్యా, యీజిప్టు, యింగ్లండు మొదలగు దేశములకు గూడ నతిసన్నని వస్త్రముల నెగుమతి చేసిన దేశములో తిండి, వృత్తులు లేక ప్రజలు దక్షిణా ఫ్రికా, మలయా, సింగపూరు, బర్మా, నేటాలు, సింహళము మొదలగు దేశములకు పొట్టచేతబట్టుకొనిపోయిరి పరతంత్ర, యంత్రతంత్ర రాజ్యముల కుట్రఫలితముగ దేశమునకు వెన్నె ముకయైన పల్లెపట్టుల పాటకజనము,విద్యావంతులబుద్ధిబలము పట్టణములకు తరలి పల్లెలు గబ్బిలములకు గుడ్లగూబలకు నిలయములయ్యెను. చేతివృత్తులు విలయములయ్యెను. పట్టణ జనము. 'దుబాషులు', దళారులు, పరాన్న భుక్కులు వస్తు సంపదను స్వయముగ వృద్ధిచేయనివారు, సంఘోపజీవులు తిండికి మొండైరి. దేశమునకు భారమైరి. దేశము పరపంచల పాలైపరుల కూడిగము చేయవలసిన దుస్థితిపట్టెను.

# పందొమ్మిదవ శతాబ్దము

దాస్యాంబుధిలో మునిగి సుమారు నూరువత్సరములు గడచిన తరువాత 1857 లో భారత దేశమున నొకగొప్పరాజకీయ విప్లవము రేగెను ఆంగ్లేయులచేత ఫకీరులు గావింపబడిన రాజులు, రాణులు, సిపాయిలు, ప్రజాగణములు నేకమై ప్రభుత్వముపై యుద్ధము ప్రకటించి పదిపన్నెండు మాసముల వరకు సాగించిరి. కాని భారతీయులలో సంఘటన శక్తి, యేక నాయకత్వము, ఆధునిక యుద్ధపరికరములు లేకపోవుటచేతను యింగ్లీషువారిచే సృష్టింపబడి నిలపబడిన హైదరాబాదు మొదలగు సంస్థానాధిపతులు, ఘూర్ఖాలు, సిక్కులు బ్రిటిషువారికి సాయపడుటచేతను చివరకీ స్వాతంత్ర్యయుద్ధములో భారత దేశ మోడిపోయెను.

వెంటనే దేశమంతయు నిరాయుధము గావింపబడెను. నిర్బంధశాసనములు సైనిక దోపిడీలు విచ్చలవిడిగా సాగింపబడ దేశము మరియొకసారి కొల్లగొట్టబడెను. దేశభక్తులను పట్టపగలు చెట్టుకొమ్మలకు గట్టి యురితీసి ప్రజలను భయభ్రాంతులనుచేసిరి. తెల్లదొరల వీరవిహారమునకు మేరలేక యుండెను. సామాన్యప్రజలు దారిలేక వికావికలై పారిపోయిరి. ఓడిపోయిన రాజులు గతిలేక తెల్లవారి బంగారు గొలుసులకు లొంగి బానిసలైరి. మధ్యతరగతివారు, విద్యోప జీవులు

మెల్ల మెల్లగా ప్రభుత్వ సంస్థలలో నిరికిగొనిరి. కొందరు ప్రభుత్వపద్ధతులను, నడవడులను, నాగరికతను, వేషభాషలను చివరకు మతమును కూడ ననుకరించి యనుసరింపనారంభించిరి. రాజకీయ దాస్యములో కొందరికి సుఖమబ్బెను. వృత్తి దొరికెను. కొందరికి భావదాస్యము, విద్యాదాస్యము, మత దాస్యము కూడ ప్రాప్తించెను.

ఆంగ్లేయులకు కావలసినది వర్తకము. కనుక తమ వర్తకము తమ లాభము ప్రభుత్వ లక్ష్యములు. భూతదయ చేతనే ప్రజలను పాలించుటకు వారిచ్చటకు రాలేదు. వారికి ప్రజలతోను, వారికోరికలతోను, వారియార్థిక, సాంఘికావసరములతోను నిమిత్తములేదు. ఆంగ్ల వర్తకము కొరకే ఆవిరియంత్ర (Steam Roller) ప్రభుత్వము సాగింపబడెను. రాజులు బూజులైరి. ప్రజలు నాయకత్వములేక భయము చేతను బలవంతముచేతను పరప్రభుత్వమునకు దాసిలొగ్గిరి. విద్యార్థులు ఆంగ్లవిద్య నుపాసించి ప్రభుత్వ ఫ్యాక్టరీలలో శరణుజొచ్చిరి. ఇట్లొక యుక్తశతాబ్దము జరిగెను. దాస్యకుంచము నిండుచుండెను. దేశములో నార్థిక రాజకీయ దివాలా యొకవంక సాగుచుండెను,

ఇంకొక వంక పందొమ్మిదవ శతాబ్దములోనే చివరిభాగములో రాజా రామమోహనరాయి, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, స్వామి రామతీర్థ మొదలగు మహానుభావులుద్భవించిరి. వీరికి ప్రత్యక్ష రాజకీ

యములతో సంబంధము లేదు. కాని భారతపతనమునకు, భారతయవహేళనకు వీరు మొట్టమొదట యడ్డ కట్టవేసిరి. యుద్ధరంగములో విషాదగ్రస్తుడై యస్త్రసన్యాసము చేసి చతికిలబడిన అర్జునునకు శ్రీకృష్ణుడు మొట్టమొదట వివేకమునే బోధించెను. వివేకమును, పౌరుషమును కోల్పోవుట చేతనే దేశములు రాజ్యములను, సిరిసంపదలను, జ్ఞానవిజ్ఞానములను పోగొట్టుకొని పరుల కూడిగము చేయుట తటస్థించును. కనుక వీరు మొదట దేశము కోల్పోయిన వివేకమును ప్రజలకర్పించి పాశ్చాత్యప్రభావ ప్రామాణ్య వేగముచే కొట్టుకొని పోవు చున్నవారిని మేల్కొలిపి యంతరంగమునుండి పని చేయ ప్రారంభించిరి.

రాజా రామమోహనరాయి స్థాపించిన బ్రహ్మసమాజము, దయానందసరస్వతి యార్యసమాజము, రామకృష్ణ వివేకానందుల వేదాంతవీరవిహారము, స్వామి రామతీర్థుని దేశభక్తి ప్రపూరితమైన యనుభవజ్ఞాన గంగా ప్రవాహము వెల్లువలై యింగ్లండును దాటి నూతన ప్రపంచమైన యమెరికాపై ప్రవహించి వారిని చకితులను చేసెను; దిగ్భ్రమ నొందింప జేసెను. ఈ సందేశమే స్తబ్ధ భారత ప్రజలకు కూడ మేల్కొలు పయ్యెను. అభయమే దైవనిర్వచనమని, జ్ఞానమే పరమగమ్యమని బోధింపబడెను. వీరిచే ప్రత్యక్షముగ రుజువు చేయబడెను. ఈ నూతన భారత సందేశము నూతన ప్రపంచము (అమెరికా) నుఱ్ఱూతలూగించెను. వివేకానంద, రామతీర్థల

మహోపన్యాసములు వారి బ్రహ్మతేజము అమెరికాలో జ్ఞానపతాకను స్థాపించి యనేకమంది విద్యార్థికులగు స్త్రీ పురుషుల నాకర్షించి భారత విజయమునకు నాందియయ్యెను. భారతదేశములో కూడ నిది కొంత చైతన్యమును కలిగించెను. ఆంగ్ల, పాశ్చాత్య విద్యావ్యామోహితులై మనోవికాసము లేక, తమ విజ్ఞానసారము నసలేచవిచూడక, జీవితమూలముల తఱచక, నంతరంగశోభ నెఱుంగక, వేష, భాష, భావ, మత దాస్యమునకు దోసిలొగ్గి పరావలంబనకు పాల్పడ్డ ఆంగ్ల విద్యార్థికులమైకము నిది పోగొట్టనారంభించి భారతము నొకవంక, భగవద్గీత నొకవంక యారాధించునట్లు చేయ గలిగెను. భారత యువకులెందరో తమ జ్ఞాన విజ్ఞానరస ములను గ్రోలి నూతనాధ్యాయమును త్రొక్కనారంభించిరి. ఇది వివేకానంద రామతీర్థుల కృషి ఫలితము. మతముతో పాటు ఉదాత్త జాతీయతను, ఉత్తమ మానవత్వమును వారు బోధించి విజాతీయవికాశములను వెనుకకు నెట్టిరి.

# ఇరువదియవ శతాబ్దారంభము



చీకటినుండి వెలుతురు, నిరాశనుండి యాశ, కష్టముల నుండి సుఖములు, ఆవేదననుండి కార్యారంభము బయల్వెడలునట్లే యంధకారమునుండి సంధ్యాకాంతులు బయలుదేరెను. హూణవిద్యాధికులలో క్రొత్త సంచలనము కలిగెను. బ్రిటిషు ప్రభుత్వ మెంత యణగత్రొక్కవలెనని ప్రయత్నించినను, ఎన్ని కట్టుదిట్టములు చేసికొనినను, దేశమును నిలువు దోపిడి చేసినను వారికందని ప్రభావము, సంస్కృతి యీ దేశములో మినుకుమినుకుమనుచున్నను మిగిలియే యుండెను.

ఫొనిక్సు అను నొక జాతిపక్షి తన బూడిదనుండియే తిరిగి పుట్టుచుండునను నొక కవి సమయము కలదు. అట్లే భారత స్వాతంత్ర్య విహంగ మీ దేశములో నులిమివేయబడినను దక్షిణాఫ్రికా ఫొనిక్సు ఆశ్రమములో తిరిగి తన రెక్కలను విదల్చుచు భారత రాజకీయ గగనమార్గమున యథేచ్ఛగా విహరించుట కాయత్తపడుచుండెను. ఈ గాథనే ముందు ముందు మనము వినగలము.

1857నాటి స్వాతంత్ర్య యుద్ధ ప్రయత్నములను, చరిత్రను వింటిమి. వివేకానంద రామతీర్థుల జ్ఞానదిగ్విజయయాత్రలను కనుగొంటిమి. కాంగ్రెసు సభలు సంవత్సరమున కొకసారి

బొంబాయి, కలకత్తా, మద్రాసులవంటి మహానగరములలో మాత్రమే జరుగుచు క్రిస్టమసుపండుగ దినములలో నలువైపులనుండి వకీళ్లు, డాక్టర్లు, విద్యాధికులు, పెన్నుకర్రల వారు, జరీమడతలవారు రెండురోజులు చర్చలు జరపుచు మూడవరోజున యెవరిండ్లకు వారు పోయి తిరిగి సంవత్సర సభలకు వచ్చెడివారు. ఇంగ్లీషులోనే తీర్మానములు, ఉపన్యాసములు కాంగ్రెసు వ్యవహారమంతయు ఇంగ్లీషు బాణీలోనే జరుగుచుండెను. కొన్ని సంస్కరణలు కావలెనని, పెద్ద యుద్యోగములు, కోర్టులు, యూనివెర్సిటీలు, ప్రాతినిధ్యములు కావలెనని మొదటి కాంగ్రెసు సభలు వాంఛించుచుండెడివి. ప్రజాసామాన్యముతో వీరికంత సంబంధము లేదు. ఇంగ్లీషువారు తొలగిపోయి వెంటనే స్వరాజ్యము రావలెనను పెద్ద కోరిక యప్పటికి లేదు.

ఈ కాలములో మన గ్రామ యార్థిక, రాజకీయ, వైజ్ఞానిక పరిస్థితులెటులున్నవో కొంత తెలియవలెను. ఆంగ్ల ప్రభుత్వము రాకపూర్వము ప్రతిగ్రామములోను, వీధి బడులుండెడివి, బడి, గుడి లేని గ్రామమే యుండెడిది కాదు. ఈ బడులలో దేశభాష లన్నింటిలోను అన్ని జాతుల వారికి చదువులు చెప్పెడివారు. బడికి పోవు వయసు వారు పగటి బడులకు వెళ్లెడివారు. రాత్రులందు శాస్త్ర పురాణేతిహాసముల ద్వారా గ్రామ జనులందరకు నీతులు, చరిత్ర, ప్రపంచజ్ఞానము వారివారి భాషలలో కొంచెమించుమించు

వారిండ్ల సమీపములోనే యతిచౌకగ లభించెడివి. జీతములు, పరీక్షలు, ప్రమోషనులు, బల్లలు, కుర్చీలు, మార్కులు, ప్యాసులు శిఫార్సులు అనునట్టి హాసము లేవియు లేవు. రాతి భవంతులు, వసతిగృహములు నవసరము లేకుండ తరుచ్ఛాయల క్రింద, దేవాలయ ప్రాంగణములందు, వినీలాకాశ శోభ క్రింద వేనకువేల ప్రజల జీవితమునకు సంబంధించిన చదువు చదువుకొనుచు రాజ్యములనేలు దక్షత కూడ ప్రముఖుల వద్ద నేర్చుకొనెడి వారు.

ఇక గ్రామ సీమలకు గ్రామ ప్రజలకు కావలసిన వృత్తి పనులు ప్రత్యేక పేటలలోను, సంతలలోను, వీధులలోను, క్రిక్కిరిసిన జనముతో కిలకిలలాడుచు ప్రదర్శింపబడుచుండెడివి. కమ్మరము, కుమ్మరము, వడంగము, తాపీ, నేతకట్టడము, చెక్కడము, కరగడము, లోహము, వెండి బంగారములు మొదలగు సమస్త వృత్తులు గ్రామములలోనే యుండెడివి. ప్రజలకు తిండి, బట్ట, వృత్తి, యిల్లు మొదలగు గ్రాసవాసములకు లోటు లేకయుండెడిది. చేతిపని నోటికి తిండియందిచ్చెడిది. ఈ దృశ్యమంతయు యింగ్లీషు చదువులు వచ్చుటతోడనే మారిపోయెను. కిటకిటలాడు గ్రామములు గబ్బిలములకు దారిద్ర్యమునకు నాటపట్టయ్యెను. వృత్తులు నశించుటతోడనే జీవనాధారము కొరకు జనులు పరదేశములకుపోయిరి. పల్లెలను పాడుబెట్టి యింగ్లీషు చదువులకొరకు కొందరు పట్టణములకు పోయిరి. ఈ చదువులు దేశభాషలో

లేక నతిప్రియముగ లభించుచుండుటచే కొందరాస్తిపాస్తుల నమ్ముకొని పట్టణములు జేరిరి. భూమినంటి పెట్టుకొని యున్నవారు మాత్రము పల్లెలలో మిగిలిరి. వ్యవసాయములో లబ్ధిపోయెను. నూటికి డెబ్బదిమంది దేశభాషలు చదువుకొనువారు ఆంగ్లప్రభుత్వములో తొమ్మిది పదిమంది యత్కరాస్యులుగ దిగనారిపోయిరి. ఈ చదివినవారా 'యింటికి జ్యేష్టాదేవత పొరుగుకు శివాలక్ష్మి' యనునట్లు దేశమున కన్నము పెట్టలేరుకాని పరదేశమునకు మూటలు పంపుచుండిరి. పరప్రభుత్వమును వీరేమోయుచుండిరి,

ఇట్టివారిచే మొదట నడుపబడిన కాంగ్రెసులకు ప్రజలతో ప్రత్యక్ష సంబంధములేదు. ఇట్టి కాంగ్రెసులు పదిహేను వత్సరములు జరిగెను. ఇరువది శతాబ్దారంభములో కాంగ్రెసులో కొంత చురుకు, తీవ్రత, దేశీయత కాన్పించెను. విదేశములలో సంచారము చేసివచ్చి యచ్చటి స్వేచ్ఛావాతావరణమును చవిచూచిన కొందరు ధీమంతులు దేశావసరములను లెస్సగా గ్రహించిరి. ఆంగ్ల సాహిత్యములోని స్వతంత్ర భావములను జుర్రుకొనిన కొందరు దేశభక్తి ప్రేరితులై పరప్రభుత్వమున కెదురాడుచుండిరి. ప్రభుత్వ నిర్బంధ విధానము దీనికి మరింత దోహదము చేసెను. 'విభజించి పాలించుట' యను కూటనీతిని ప్రయోగించి దేశములో అనైక్యతను రేకెత్తించి హిందూ మహమ్మదీయ కలహములను పెంచుచుండిరి.

1905 అక్టోబరు 16వ తేదీని, 'విభజించి పాలించు కూటనీతికి' పేర్గాంచిన కర్జను ప్రభువు, వంగదేశమును రెంటిక్రింద విభజించెను. వివేకానందుని యుపదేశములను చవిచూచిన వంగయువకులు విజాతీయ పరాభవమును భరింపజాలక భగవద్గీత నొకచేత బాంబునొకచేతబూని బలప్రయోగమునకుదిగిరి. శక్తినారాధించు వంగభూమి సురేంద్రనాధ్ బెనర్జీ, బిపిన చంద్రపాలు, అరవిందఘోషు ప్రభృతుల నాయకత్వముక్రింద 'వందేమాతరం' అనగా తల్లికి నమస్కారము అను యుద్యమమును లేవదీసిరి. ఆ రోజులలో ఆ మాటయనుటయే మహాతప్పిదము.

నాయకులు దేశమంతయు తిరుగనారంభించిరి. 1908లో సురేంద్రనాధ్ బెనర్జీని లాఠీఛార్జి చేసిరి. తత్ఫలితముగా తెల్ల దొరలపై దౌర్జన్యములు దేశమంతట జరిగెను. కింగ్సుఫర్డు అను కలెక్టరును చంపుట కుద్దేశింపబడిన బాంబువలన 1908 ఏప్రిల్ 30వ తేదీని కెన్నడీ దంపతులు చంపబడిరి పంజాబు సింహములాలాలజపతిరాయి, మకుటము లేని మహారాష్ట్ర నాయకుడు బాలగంగాధర తిలకులు యీ యుద్యమమును దేశవ్యాప్తముగావించిరి. ఆసేతుహిమాచల పర్యంతము వందేమాతరనినాదములు వినిపింపబడెను. వంగదేశములోనేకాక భారతదేశమంతట బాంబుమోతలు, చిల్లర దౌర్జన్యములు జరుపబడెను.

బ్రిటిషువారి ప్రభావముక్రింద గ్రామములు, గ్రామప్రజలు యెట్టి దుస్థితికి తేబడెనో వినియుంటిమి. ఈ కాలములో నేర్పడిన కోర్టులు, పాఠశాలలు, రైళ్ళు ప్రభుత్వమున కండగా నుండుటకే నిర్మింపబడెను. కాని చెడ్డలో కూడ మంచి యుండును. ఈ సంస్థలే వివిధరాష్ట్రప్రజల నొకచో సమీకరించుటకు, నొకభాషలో చర్చించుకొనుటకు నావకాశ మిచ్చెను. భారతదేశ మనాదిసిద్ధముగ భౌగోళికముగ, మత చారిత్రిక, సాంఘిక సాంప్రదాయాదికముగ నొక్కటియే యను యనుభూతి దేశములోనున్నను ఆంగ్లేయులువచ్చునప్పటి కది రాజకీయముగ ననేకముక్కలయ్యెను. ఆంగ్లేయులవలన యీ ముక్కలన్నియు నేకముగావింపబడి యొకే యాంగ్ల శాసనత్వముక్రిందకు తీసికొని రాబడెను. ఏకప్రభుత్వము చేకూరెను. కాని యది పరప్రభుత్వమగుటచే దేశమంతయు డొల్లచేయబడెను. ఈ దాస్యయుగములో రైళ్ళు, స్టీమర్లు, పల్లెగ్రామములు, ఆనకట్టలు మన పూర్వులెరుగని కొన్ని ప్రయాణసౌకర్యములు కలుగుటచే కొంతమందికిది యంతయు నాగరికతక్రింద, బ్రిటిషు ప్రభుత్వము కావించిన మహోప కారములక్రింద కాన్పించెను. బాహ్యప్రపంచమునకీ మేళ్లే చాటబడుచుండెడివి. చారిత్రకముగ నిది నిజమే యైననునివి యన్నియు శాస్త్రముల ప్రభావముచేతను, యంత్రప్రభావము చేతను, ప్రపంచమునకంతకును కలిగిన మేళ్లే కానియొక్క భారతదేశమునకే బ్రిటిషువారు ప్రసాదించినవి కావు.

నిజమేమన స్వతంత్రములగల దేశములలో నీ యంత్రములను, శాస్త్రములను, విజ్ఞానమును తమ దేశముల యభివృద్ధికొరకే వినియోగించుకొనుచుండ యింగ్లీషువారు వీనిని భారత దేశములో యథేచ్ఛగా తమ లాభముకొరకే తమవర్తక, రాజ్యాభివృద్ధికొరకే, వినియోగించుకొనిరి. కనుకనే కరువులు మాటిమాటికి తలయెత్తుచు ధాత, యీశ్వరకవులని 1877లో జగప్రసిద్ధిబడసినవి. లక్షలకొలది జనులు తిండిలేక చనిపోయిరి. స్వతంత్రమేయున్నచో మనమీ శాస్త్రజ్ఞానమునంతను మనపరిశ్రమల యభివృద్ధికొరకు వినియోగించుకొనెడివారము. కాని యట్లుజరుగలేదు.

ఇక తెరమఱుగున దేశవిద్రోహాచర్యలెన్నియో జరిగెను. ఉప్పు పన్ను చరిత్ర, అధికార దురహంకారముతోగూడిన ప్రజాసిర్లక్ష్యము, ప్రతి విషయములో శ్వేతజాతికి ప్రత్యేకాధికారములు, సౌకర్యములు, లండనులోని బాధ్యతలేని యిండియా ఆఫీసు గుడ్డిప్రవర్తన, స్వేచ్ఛావాణిజ్యముపేర కుటీరపరిశ్రమలను తుడిచిపెట్టుట, గ్రామసీమలన్నియు నార్థిక దివాలా తీయుట, నల్లవారి తిండిలాగి తెల్లదొరల భోగములు సమకూర్చుట- ఈ యంతర్నాటకమంతయు 'భారతీయులను నాగరికులను చేయుట' యను సాకుతో యింగ్లీషువారి భూతదయాళుత్వము' క్రింద చెలామణి చేసికొనుచు కొంత మంది వందిమాగధుల నేర్పరచుకొని సాగించుచుండిరి.

# కాంగ్రెసు సంచలనము

1885లో ప్రారంభింపబడిన కాంగ్రెసు 1906 వరకు మందగమనము చేయుచు వంగ విభజనతో కొంత సంచలనము నొందెను. కర్జను ప్రభుత్వము నిరంకుశత్వమునకు, అధికార రహస్యచట్టములకు పంటభూమి యయ్యెను. దేశభాషల పత్రికాప్రచారము నరికట్టు చట్టము, యూనివెర్సిటీల చట్టము, అధికారరహస్యముల చట్టములవంటివి గోక్లే, దాదాభాయి నౌరోజి, లాలాలజపతిరాయి, తిలకు మహాశయుల పౌరుష మును రగుల్కొలిపెను.

లాలాలజపతిరాయి గొప్పవక్త; త్యాగి, భావప్రపూరిత మైన రచనాశక్తి గలవాడు. అమెరికా మొదలగు దేశము లలో ప్రవాసితజీవితమును గడిపి స్వతంత్రవాయుసంచారము ననుభవించి స్వదేశము కొరకు సమస్తము నర్పించిన యోధుడు. బహుగ్రంథకర్త. అనేక ప్రజాసంస్థలను, పత్రికలను నిర్వహించుచూ 'పంజాబు సింహము' అని పేరు పొందినవాడు. 'మనమిక నెంతమాత్రము ముష్టివాండ్రముగ నుండ తగదు' అని యతడు గర్జించెను. 'ఆందోళన, ఆందోళన' యని దాదాభాయినౌరోజి దిశలు పిక్కటిల్లునట్లు మహోపన్యాసముల నిచ్చుచు బ్రిటిషు పార్లమెంటుకు విని పించెను. కాంగ్రెసు చరిత్ర కొంత రసవత్తరఘట్టములో పడెను. దాదాభాయి, రొమేషుచంద్రదత్తు, విలియండిగ్బీ ప్రభృతులు రుజువులతోను, అంకెలతోను భారతదేశ నిలువు

దోపిడిని గురించి వ్రాసిన పుస్తకములు బ్రిటిషు ప్రభుత్వ నిజతత్త్వమును ప్రపంచమునకు ముక్తకంఠముతో చాటెను. ఈ నిజము భారత దేశములోని యమాయిక ప్రజలకు గూడ వెల్లడి కాజొచ్చెను.

ఈ సంచలనముతో 1906లో కాంగ్రెసు రెండుపక్షముల క్రింద చీలిపోయెను. గోఖ్లే మితవాద పక్షనాయకుడు. ప్రభుత్వముతో తలపడుట కిష్టపడనివాడు. కంచెమీద పంచ తొలగించుకొనునట్లుపాయముతో ప్రభుత్వమునుండి లాభములను పొందవలెనను సౌమ్యచిత్తుడు. బాలగంగాధరతిలకు అతివాద పక్షమునకు నాయకుడు. ఇతనిని తిలకుమహారాజు అని పిలచెడివారు. ఇతడు మహామేధావి. ఇతడున్న చోటు దర్బారువలె నుండెడిది. ఇతడు మహారాష్ట్రమునకు కిరీటములేనిరాజు. 'స్వరాజ్యము నాజన్మహక్కు. దానిని నేను సాధించి తీరుదును' అని చాటిన ధీరుడు. ఇతని వ్రాతలు, ఉపన్యాసములు ప్రభుత్వమును హడలెత్తించుచుండెను. మహారాష్ట్రమంతయు నితనితో కదలుచుండెడిదని చెప్పెడివారు. శివాజీ, వినాయకుల యుత్సవములను జరిపించుచు యువకులలో నితడు జాతీయతను రగుల్కొలుపుచుండెను. ఇతని వ్రాతల కితనిపై నేరము మోపి యారేండ్ల శిక్ష విధించి మాండలే కోటలో నిర్బంధించి యుంచిరి.

వందేమాతరోద్యమముతో బయలుదేరిన దౌర్జన్యచర్యలకు, కుట్రలకు నాయకులని వినాయకసావర్కారు గణేశ

సావర్కారు సోదరులకు ద్వీపాంతరవాసశిక్షలను విధించిరి, ఇంగ్లండులోనున్న వినాయక సావర్కారును పట్టుకొని తీసికొనివచ్చుచుండ నతడు పిరికివానివలె లొంగిపోవుట కిష్టములేక శివాజీ ఔరంగజేబు కోటలోనుండి తప్పించుకొనినట్లు ఓడలోనుండియే సముద్రములోనికి దూకి యీదుకొని పోయి ఫ్రెంచితీరము చేరి మేటిధీరతను చాటుచుండగా ఫ్రెంచిపోలీసులకు లంచమిచ్చి యంతర్జాతీయ సూత్రములకు విరుద్ధముగా నతనినిపట్టుకొని, భారత దేశమునకు తీసుకొనివచ్చి కూటసాక్ష్యములు పలికించి ద్వీపాంతరశిక్ష విధించి యండమానుదీవులకు పంపించిరి. * ఈయాందోళన, యీశిక్షలు దేశములో మారుమూలలకు గూడా వ్యాపించెను. ప్రభుత్వ పాఠశాలలను బహిష్కరించి జాతీయ పాఠశాలలను స్థాపించుట, విదేశ వస్త్రములను తగులబెట్టి స్వదేశ మిల్లునూలు వస్త్రములనే వాడుట, రహస్యముగా కుట్రలుపన్నుట, మందుగుండు సామగ్రి తయారుచేయుట మొదలగు కార్యములు సాగింపబడెను.

ఈ భీభత్సముల ఫలితముగా వంగదేశ విభజనను రద్దుచేసి రెండుభాగములను తిరిగి కలిపివేసిరి. భారతదేశ పరిస్థితులింటులుండగా మన మొకసారి వలసపోయి కుములుచున్న వలసభారతీయుల చరిత్రను కొంత గమనింపవలసియున్నది.

---

* ఈ గ్రంథకర్తచే వినాయక సావర్కారు వీరగాథ వివరములతో 1927 లోనే రచింపబడి బ్రిటిషు ప్రభుత్వ క్రోధానలమునకు గురియై 1933లో నిషేధింపబడెను.

# కూలీ బారిష్టరు గాంధీ

బ్రిటిషు ప్రభుత్వయార్థిక రాజనీతులధర్మమాయని లక్షలకొలది భారతీయులు వృత్తిలేనివారై యన్నవస్త్రములు లేక పొట్టచేతబట్టి మూడువేలమైళ్ళ దూరములోనున్న దక్షిణాఫ్రికాకు వలసపోయిరి. తమిళులు, కన్నడులు, గుజరాతీలు, ఆంధ్రులు, ఉత్తరహిందూస్థానీయులు, అనగా గ్రామీణులందరు వ్యత్తులుపోయి కూలిచేసి కొనుటకు దేశాంతరవాసులై కొందరీ విచిత్రదేశము చేరిరి. ఇది యడవులతోను, రుప్పలతోను, పొదలతోను నిండి వ్యవసాయాభివృద్ధిలేక యున్న దేశము. ఇది భారతదేశము కంటె నేడురెట్లు పెద్దదేశము. ఇచ్చటి ప్రజలు నీగ్రోలు, బోయర్లు, జూలూలు అనబడువారు. వర్తకము కొరకు అన్వేషించుచుండిన శ్వేతజాతివారీ దేశమును కనుగొని దీనినాక్రమించి యిచ్చట తమరాజ్యమును స్థాపించిరి.

దీని నభివృద్ధి చేయుటకై వారికి జనము కావలసివచ్చెను. ఇచ్చటి జాతులవారు వ్యవసాయము చేయరు. శ్వేతజాతివారికి కూలీలు కావలెను. భారతప్రభుత్వము తెల్లవారి ప్రభుత్వము. వారీ దేశములో నసంఖ్యాకులైన ప్రజలను కూలీలుగ తయారు చేసియేయుంచిరి. దక్షిణాఫ్రికాలోని తెల్లప్రభుత్వము వీరితో రాయబారములు జరిపి తమకు కావలసినంతమంది కూలీల నెగుమతి చేయించుకొనుటకు,

అయి దేళ్ళ కంట్రాక్టు పద్ధతిమీద ఖరారు వ్రాయించు కొనుటకు, నేర్పాట్లు చేసిరి. దక్షిణాఫ్రికా స్వర్ణభూమియని, యచ్చటకు పోయినచో రెండుచేతుల ధనము సంపాదించు కొనవచ్చునని, యచ్చట జీవితము స్వర్గము వలె నుండునని యైదు వత్సరముల కాలము పనిపూర్తియని తరువాత కావలసినంత స్వేచ్ఛగా నుండవచ్చునని, యచ్చట ఆస్తి పాస్తులు సంపాదించు కొనవచ్చునని పెద్దపెద్ద డిపోలుపెట్టి దేశమంతట ప్రచారములు గావింపబడెను. ఇట్లు పలుప్రాంతములనుండి వేనకువేలు జనులు దక్షిణాఫ్రికా తరలి పోయిరి,

కాని భారత దేశమునుండి వలసపోయిన వారందరు నిజముగా కూలీలుకారు, వ్యవసాయము, నేత, వడ్రంగము, కమ్మరము వివిధశిల్పకళలలో నారితేరి ప్రభుత్వ రాజనీతి చేతనే కూలీలు గావింపబడినవారు. ఆఫ్రికా వెళ్లుటతోడనేవీరు చెమటూడ్చి పనిచేయుచు నన్నిపనులను చక్కబెట్టుకొనుచు కంట్రాక్టుకాలము పూర్తియగుటతోడనే యచ్చటనే యుండి వర్తకాదులను చేసికొనుచు వృద్ధికాజొచ్చిరి. కొంతమంది యీ దేశమునుండి వర్తకులుగను, వైద్యులుగను, వకీల్లుగను పనిచేయుట కచ్చటకు వెళ్లిరి. వీరందరు తమపొదుపు చేతను, చాకచక్యము చేతను, కష్టించి పనిచేయుటచేతను, నిరాడంబరజీవితము చేతను స్థలములను, ఆస్తిపాస్తులను సంపాదించు కొని స్వేచ్ఛాజీవనము చేయనారంభించిరి. బంజరుగన్నుం

డిన దక్షిణాఫ్రికాను వీరు సస్యశ్యామలముగను సకలఫల సంపన్నముగను చేసిరి. ప్రస్తుత డర్బను, జొహాన్సుబర్గు మొదలగు నగరములయైశ్వర్యమునకంతకు భారతీయులే కారకులు. కూలీలుగా వెళ్లిన వారైశ్వర్యవంతులుగ మారుట శ్వేత జాతికి కన్నెఱ్ఱయయ్యెను. భారతీయులపోటీవారి కనర్ధముగ నుండెను, తమ భాగ్యభోగ్యముల కవసరమైనంతవరకే వారు భారతీయులను రక్షించిరి.

అవసరము తీరినది కనుక వారు దురాగతములకు దిగిరి. అనేకక్రూరపద్ధతుల నవలంబించి వారు భారతీయులను స్వదేశమునకు తరుమగొట్ట సంకల్పించిరి. భారతీయులు స్వేచ్ఛగ వర్తకము చేసికొనరాదు; ఆస్తిపాస్తులచ్చట సంపాదింపరాదు. తెల్లవారి సరసన రైళ్లలోను ట్రాములలోను కూర్చొనరాదు. వారి పేటలలో యిండ్లుకట్టుకొని నివసింపరాదు, కోర్టులలో స్వేచ్ఛగా వాదింపరాదు. బస్సులలోను, గుఱ్ఱపు బగ్గీలలోను వారితో కలసి యొకేతరగతిలో ప్రయాణముచేయరాదు. భారతీయు డెంతటివాడైనను, 'కూలీ' జాతివాడు. అతడెట్టి యవమానములకైనను, దండనలకైనను తగ్గుడు. హోటళ్లలోను, వసతిగృహములలోను తెల్లవారితో వారికి చోటీయరాదు. వారూరుబయటనే నివసింపవలెను, ఇంకను వారిమీద నెన్నియో యాంక్షలుకలవు.

భారతస్వాతంత్ర్య విహంగ మీ దక్షిణాఫ్రికాలోనే 'ఫోనిక్సు' అనునాశ్రమమున పొదుగుచు భారతరాజకీయాకాశా

శమున పతుపవిత్తేపము చేయనున్నట్లు వినియుంటిమి. కాబా గాంధీ పుతలీబాయియను పుణ్యదంపతులకు 1869లో పోర్బందరు గ్రామములో మోహనదాసు కరంచందుగాంధీ జనించెను. అతడు మెట్రిక్యులేషన్ పరీక్షలో నుత్తీర్ణుడై మాతృదేవి యనుజ్ఞబడసి బారిష్టరు పరీక్ష చదువుట కింగ్లండు వెళ్లెను దానిలో నుత్తీర్ణుడై యతడు భారత దేశము తిరిగి వచ్చి బొంబాయిలో ప్రాక్టీసు చేయుచుండెను. దక్షిణాఫ్రికాలోని యొక పెద్దకంపెనీ తరఫున వాదించుట కతడా విచిత్రఖండములో 1893 మేమాసాంతమున ప్రవేశించెను. అతడచ్చట నొక సంవత్సరముండుటకే యేర్పాటు గావించుకొని యుండెను. కానియతడా దేశములో పాదము పెట్టిన ముహూర్తము మొదలు 1914 వరకు ముప్యేదువత్సరములా ప్రభుత్వముతో నిరంతర సత్యాగ్రహ పోరాటము సలిపి చివరకు విజయయము సాధించెను.

ఆఖండములో ప్రవేశించిన రెండవరోజునే యతడుడర్బను కోర్టుకువెళ్లెను, కోర్టులో కూర్చొనియుండగా మేజిస్ట్రేటతనిని మిర్రిమిర్రిచూపులతో తేరిబారిచూచి యతడు ధరించిన తలపాగ తీసివేయవలసినదని యాజ్ఞాపించెనట. అతడందుల కియ్యకొనక కోర్టునుండి వెడలిపోయి 'ఓహోనాకొరకిచ్చట నొకరంగము సిద్ధముగనున్నదే' యనితలపంకించెనట. వెంటనేయీయుదంత మచ్చటి పత్రికలందు నెక్కి యతని పేరు ప్రచారము కాజొచ్చెను. అతడచ్చట నున్నంతకాలమూ తలపాగమాత్రము తీయలేదు.

ఆ వారాంతములోనే యతడు మొదటి తరగతి టిక్కెటు కొని ప్రిటోరియా బయలుదేరెను. అతడు బండిలో కూర్చొని యుండగా నొకరక్షకభటుడు వచ్చి బరబర క్రిందకు లాగివేసి యతని సామాను ప్లాట్‌ఫారం మీద విసరివేసెను. తెల్ల వారున్న బండిలో నల్లవాడెక్కకూడదట. ఈ 'నల్లవాడు' పాశ్చాత్త్యుల మదమడగించుట కచ్చటకు వచ్చిన 'నల్లనయ్య' యను సంగతి యా తెల్లవాని కేమి తెలియును? గజగజవణం కించు చలిలో నిశీధమందత డొంటరిగ స్టేషనుప్లాట్‌ఫారం మీద బిక్కుబిక్కు మనుచునుండి, 'పిరికివానివలె నేను నా దేశమునకు తిరిగిపోవుటయా లేక నొకింత భారత పౌరుషమును చూపుటయా' యని కొంచెము సేపాలోచించి యానిమిష మందే యచ్చటనే తెల్లవారి 'రంగుజాడ్యము'ను నిర్మూలించుటకు నిశ్చయించుకొనెను. మరునాడతడు ఛార్లెస్సు పట్టణము వెళ్లెను. అచ్చటనుండి గుఱ్ఱపుబగ్గీలో జొహాన్నుబర్గు పోవునపుడు మరల త్రోవలో నతనికి తాపులు, తన్నులు, ఘోరావమానము జరిగెను. హోటలులో నతనికి భోజనము పెట్టుటకు బసయిచ్చుటకును నిరాకరించిరి. 'ఇదేమి దేశము! ఏమి ప్రజ!' అను వాక్యము లతనినోటివెంట నప్రయత్నముగ వెలువడెను. "కొద్దిరోజులు మీరిచ్చట నున్నమీదట సమస్తము మీకే తెలియగలదు. ఇట్టి దేశములో మేము మాత్రమే జీవింపగలుగుచున్నాము. డబ్బుకొరకు మేమెన్ని యవమానములనైనను భరించుచున్నాము." అని యొక

పెద్ద భారతవర్తకుడతనితో చెప్పి తమకడగండ్ల నన్నింటిని పూసగ్రుచ్చినట్లు వివరించెను. ట్రాన్సువాలు, ఆరెంజిఫ్రీస్టేటు లలో నున్న భారతీయుల దుస్థితిని కూడపూర్తిగా నతడు గ్రహించెను. సంవత్సరాంతమున నతడు భారత దేశము తిరిగి పోవలసిన సమయము వచ్చెను.

అతని కొరకొక వీడ్కోలుసభ యేర్పాటు చేయ బడెను. ఆ సభలో నతడొక పత్రికచూచుచు తిరుగవేయు చుండ 'భారతీయుల యెన్నికాధికారములు' అనునొక విష యము నకస్మాత్తుగ చూచెను. రాబోవు శాసన సభల యెన్నికలలో భారతీయుల వోటింగు హక్కు తీసివేయు చట్ట మొకటి తలపెట్టబడెను. ఈ విషయ మానాటిసభలోనున్న వారికెవరికి తెలియదు. ఇది చట్టమగుచో భారతీయుల మను గడయే మరింత దుఃఖభాజనము కాగలదు. ఈ వార్త తెలియు టతోడనే భారతీయులందరు నతనిని ప్రయాణము మానివేసి యచ్చటనేయుండి తమ్మునడిపింప వలసినదని వేడుకొనిరి. చివరకా వీడుకోలు సభ కార్యనిర్వాహక వర్గముగ మారి పోయెను. దక్షిణాఫ్రికాలో నున్న దీనభారత ప్రజా లాపములతని హృదయమును కలగించివైచెను.

# కర్మవీర బారిష్టరు

ఆఖండములో భారతీయుడెంతటి వాడైనను 'కూలీ' యని పిలువబడవలసినదే. భారతీయులు 'కూలిజాతివారు'. ప్రతి పేరుచివర సాధారణముగ 'స్వామి' యను తుదిపద ముండెడిది. ఇది 'సామి' గామారి కూలిపనికి పర్యాయపద మయ్యెను. 'స్వామి'యన కూలి కాదని యజమానియని దాని కర్థమని యెవడేని చెప్పచో నతనికి తన్నులు, చెప్పుదెబ్బలు తప్పవు. ప్రపంచమునుద్ధరించు ధర్మకర్తలమని చెప్పుకొను ఆంగ్లేయుల విశ్వవిద్యాలయములో బారిష్టరైన గాంధీజీ కూడ కూలివాడే. అతనికి 'కూలీ బారిష్టరు' అనిపేరు.

ఒక సంవత్సరముండుటకే వెళ్ళినగాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయుల కుయ్యాలించి యచ్చటనుండి పోవుటకే నిశ్చ యించుకొనిన సంగతి వింటిమి. అతని సంకల్పము వజ్ర సంకల్పము. 1898లో భారతీయులు స్వదేశములో నా గులా ములు. అచ్చట వారు మానవులేకారు. ఈ స్థితి మారిపోవ లెను. ఇది ప్రపంచమునకేచేటు. వివేకానందుని దివ్యవాణి యప్పుడే యమెరికాలోని రాజవీధులలోను, మారుమూల లలోను ప్రతిధ్వనించుచుండెను. రామతీర్థుని మోహానా కారము ఓంకార గానము, అమృతమయ భావస్రవంతి

యమెరికాను ముంచెత్తుచు ఆ నూతన ప్రపంచమును కదల్చి వేయుచుండెను. గాంధీజీ యిదే తరహాకు చెందిన వింతవ్యక్తి; గారడీడు.

కనుక నతడీస్థితిలో నీనూతన ఖండములో ఋషిసాంప్రదాయము నవలంబించి నూతనాస్త్రములను, నూతన శాస్త్రమును కనిపెట్టి యొక జాతినే కాక మానవజాతినే పవిత్రము చేయుటకు శత్రువును మిత్రువును నేకముచేయుటకు పెద్దపులిని మేకను నేకకంచమున తినిపించుటకు 'మానవుడు మానవుడే కాక దేవతకూడ కాగలడు' అని లోకమునకు విదితము చేయుటకు మట్టిముద్దలను వీరాధి వీరులుగ తయారు చేయుటకు కత్తులను, కటారులను తుప్పు పట్టించుటకు ప్రతిన బూనెను.

ఇది యొక యసామాన్య ప్రతిజ్ఞ. వెంటనే యతడు ప్రభుత్వము తలపెట్టిన బిల్లు నెదుర్కొనుటకు పెద్ద మహాజరు అర్జీలను, వేలకొలది వాలంటీరులను తయారుచేసెను. భారతీయులలో నెక్కడ లేని సంచలనము బయలుదేరెను. క్రైస్తవులు, మహమ్మదీయులు, పార్సీలు, హిందువులు అందరు భారతీయులే యను భావము ప్రజ్వరిల్లెను. భారత కార్యదర్శికి పిటీషనులు పంపబడెను. అనేక పత్రికలీ యాందోళనను సమర్థించెను. గాంధీజీ సుప్రీం కోర్టులో ప్రాక్టీసు చేయరాదనిరి. కాని చివరకంగీకరింపక తప్పినది కాదు.

1893 మే 22వ తేదీని నేటాల్ భారత కాంగ్రెసు స్థాపింపబడెను. సంవత్సరమునకు మూడు పౌనులు చందా యేర్పాటుచేసి మూలమూలల నున్న వారిని సభ్యులుగా చేర్చిరి. లెక్కలన్నియు నిర్దుష్టముగ నుంచబడెను. 1894 కాంగ్రెసు లెక్కలను నేటికిని చూడవచ్చును. ఈ సందర్భములో భారత దేశములో స్థాపించిన యెనిమిదేండ్లకే దక్షిణాఫ్రికా కాంగ్రెసు స్థాపింపబడిన దను విషయము గుర్తుంచుకొనవలెను. కాని యీ రెండింటికిని పోలికే లేదు. భారత కాంగ్రెసు మూడురోజుల ముచ్చట. దానికొక కార్యక్రమము లేదు. అది దేనితోను పోరాడు సంస్థ కాదు. ప్రజలలో నికిపోయి ప్రజాసమస్యలను తెలిసికొని వాటికి బాధ్యత వహించు భారము నది యింకను పూనుకొన లేదు. సంవత్సర సభలకు వచ్చినవారే సభ్యులు వారే ప్రతినిధులు, వారే తీర్మానములు చేయువారు. ఆ తీర్మానములను ప్రభుత్వమునకు పంపుచుందురు. కాంగ్రెసు సభలలో హుంకరించుచుందురు. 'కూలీ బారిష్టరు' బారిష్టరుగాంధీ, కరంచందుగాంధీ, గాంధీ భాయి, కర్మవీరగాంధీ, మహాత్మాగాంధీ, బాపూజీ—భారత దేశములో కాలిడువరకు భారత కాంగ్రెసు యీ విధముగనే యుండెను. దక్షిణాఫ్రికా కాంగ్రెసు, కర్మవీరుని కాంగ్రెసు. అది 'యచట పుట్టిన చిగురు కొమ్మైనచేవ' యని నట్లు ప్రజలను, విద్యార్థికులనూ, యువకులను, వృద్ధులను సంఘటిత పరచి నేటాలులోని నిజపరిస్థితులను ప్రపంచమున కంతకు

చాటుచుండెను. పుస్తకభాండాగారములు స్థాపింపబడి జ్ఞాన ప్రబోధము గావింపబడుచుండెను. కరపత్రములు యింటింట ప్రచారము గావింపబడెను. వర్తకులు, విద్యార్థులు, గుమాస్తాలు, మోటపని చేయువారు యీ కాంగ్రెసులో చేరిరి. కంట్రాక్టు కూలీలు మాత్రమిందులో చేరలేదు. సభ్యులుగ చేరు సమర్థత వారికి లేకుండెను; నిజమునకు వారు బానిసలు. 'దరిద్రనారాయణసేవయే' గాంధీజీ పరమాశయము. బీదమానవుడాకలి చెందిన భగవంతునిరూపము.

బాలసుందరము అనుకూలి వాని నతని యూరపియను యజమాని కోపావేశముచే పళ్లు రాలగొట్టెను. అతడు తలపాగ చేతబట్టుకొని రెండు బోసిపన్నులతో గాంధీజీ దగ్గరకు వెళ్ళెను, దొరదగ్గరకు పోయినపుడు భారతీయుడెవడైనను తలపాగ తీసివేసి సలాముచేయవలెను. రెండుచేతులు జోడించి నమస్కరించినను చాలదు. గాంధీజీదగ్గర కూడా నట్లే చేయవలెనని బాలసుందర మనుకొనెను. ఈ దృశ్యము గాంధీజీని కలచివైచెను. అతడా బాలసుందరము నతని తెల్లయజమానినుండి తప్పించి యతనిపై చర్య తీసికొనక మరియొకని వద్దపెట్టెను. బాలసుందరము కథ మద్రాసు వరకు ప్రతిధ్వనించెను. గాంధీజీ కూలిజనుల పాలిట కల్పవల్లి యయ్యెను. 1860లో కూలీల నచ్చటకు రప్పించిన నేటాలు ప్రభుత్వము 1894లో వారిమీద 25 పౌనులు తలపన్ను వేయనిశ్చయించెను. నేటాలు కాంగ్రెసు యీ శాసనమును

ధిక్కరింప బూనుకొనెను. భారతప్రభుత్వము నొప్పించుటకు దక్షిణాఫ్రికా ప్రభుత్వము తరఫున కొందరు ప్రతినిధులు పంపబడిరి. కాని నేటాలు కాంగ్రెసు చేసిన యాందోళన ఫలితముగ నీపన్ను మూడుపౌనులకు తగ్గింపబడెను. ఇది కూడ చాలయక్రమము, ప్రపంచములో నెచ్చటను యిట్టి వింత పన్ను లేదు. కనుక దీనిని కూడ తీసివేయించుటకే పోరాటము జరుపబడెను.

# దక్షిణాఫ్రికాతుఫాను

గాంధిజీ దక్షిణాఫ్రికా ప్రభుత్వముతో మూడేండ్లు పోరు సలిపి 1896లో భారతదేశము పయనమై వచ్చెను. ఆరు మాసములు యిచ్చట సంచారముచేసి కుటుంబముతోకూడ దక్షిణాఫ్రికా వెళ్లుట కతడు నిశ్చయించుకొనెను. బొంబాయి మదరాసు, కలకత్తా, పూనా, మొదలగు ముఖ్యనగరము లలో నతడు వేలకొలది ప్రజల నుత్తేజ పరుచుచు దక్షిణాఫ్రికాయుదంతము నంతను సభలు, కరపత్రములు, పత్రికాధిపతులతో గోష్టిద్వారా లోకమున కెరుకపరచు చుండెను.

ఈ ప్రచారమధ్యమున నుండగా వెంటనే దక్షిణాఫ్రికా బయలుదేరి రావలెనని కేబిలువార్త రాగా యతడు సకుటుంబముగ బయలుదేరెను. భారతదేశములో నతడు దక్షిణాఫ్రికాలో నున్న తెల్లవారిమీద దుష్ప్రచారము గావించెననియు, వారిని గురించి యనేక యసత్య వార్తలను ప్రకటించెననియు దక్షిణాఫ్రికాను సాధించుటకు కొంత మందిని తనతో తీసికొని వచ్చుచున్నాడనియు నతని నచ్చట కాలుపెట్టకుండ చేయవలెననియు తెల్లవారిలో అలజడి బయలుదేరెను.

డిసెంబరు మాసాంతమున రెండు ఓడలు రేవుకు జేరుకొనెను. త్రోవలో సముద్రముమీద గొప్పతుఫాను చెలరేగి దైవవశమున తగ్గిపోయెను. కాని యాఓడ వొడ్డుకు జేరినపుడు రేగిన తెల్లదుమారము తెల్లవారి నాగరికతకు తీరని కళంకమయ్యెను. ఓడలను తిరిగి హిందూదేశము పంపివేయవలెననియు గాంధీజీ నసలు దిగనీయరాదనియు విశ్వప్రయత్నములు గావింపబడెను. చివరకవి యన్నియు నిష్ఫలములయ్యెను. గాంధీజీ యోడదిగి కొద్దిదూరము పోవుసరికి ముట్టడివేయబడెను. తెల్లగూండా లాతనిని తన్నుచు, గ్రుద్దుచు, రాళ్ళు, కోడిగ్రుడ్డులు విసరుచు రాక్షసకృత్యములను గావించిరి. పోలీసువారడ్డముగ నిల్చి దుండగీడులను మరపించి గాంధీజీని కష్టముమీద యింటికిచేర్చిరి. అతడు వారిపై చర్య తీసికొనవచ్చును. పోలీసువారే యతని నట్టిచర్య తీసికొనవలసినదనికోరిరి. కాని యది యతనిమతమునకు వ్యతిరేకము. దుర్మార్గమునకు లొంగిపోక వానిని సన్మార్గముతో నెదిరించి చక్కదిద్దుటయే యతని మతము.

అతడెట్టి చర్యయు తీసికొనక భారతదేశములో జరిగిన పనిని గురించి ప్రతికాధిపతులతోను, తదితర మిత్రులతోను ముచ్చటింపగా వారు నిర్విణ్ణులైరి. రక్తమాంసాదులతో పిక్కటిల్లుచు పోతవిగ్రహములవలెనుండి దుశ్చరితములకు దిగిన తెల్లవారతని ముందు మరుగుజ్జులైపోయిరి. మూడునాలుగు రోజులలో వారి యమానుష కృత్యములు చల్లబడెను. కాని

భారతీయులలో పిరికితనము పోయినదని వారెట్టికష్టములనైన నెదుర్కొనగలరని తెల్లదొరలలో భయముపుట్టెను. కనుక వీరి నణగద్రొక్కవలెనను యుద్దేశ్యముతో రెండు బిల్లులు బనాయింపబడెను. ఒకటి భారతవర్తకుని కూలద్రోయుట కుద్దేశింపబడెను. రెండవది భారతీయుల నిక నా దేశమునకు రాకుండ చేయునది, ముందు పేర్కొనబడిన యెన్నికాధికారముల చట్టము చిట్టచివర కుపసంహరించుకొనబడెను.

దక్షిణాఫ్రికాలో భారతీయులు 'కూలీలు' అను పేరపిలువ బడుచుండిరి కదా! వీరి కొరకు బయట 'కూలీస్థావరములు' యేర్పాటు చేయబడెను. జొహాన్సుబర్గులో నిట్టి దొకటియుండెను. ఇది భారతీయులకు 99 యేండ్లకు కవులు కీయబడెను. ఇందులో ప్రజలు రోజురోజుకు పెరుగుచుండిరి. ఈస్థల మతిసంకుచితముగనుండెను. మున్సిపాలిటీదృష్టిలో నచ్చటివారు మనుష్యులే కారు. అచ్చట పారిశుధ్యము సరిగా లేకపోవుటచే నా ప్రాంతము ప్లేగుకు గురియయ్యెను. గాంధీజీ యీదుస్థితి పరికించి సేవారంగములోని కురికి యీ ప్రాంతమును రక్షించెను.

1904లో 'భారతయభిప్రాయము' అను పత్రిక స్థాపింపబడెను. ఇందులో దక్షిణాఫ్రికా సమస్యలన్నియు నిర్మొగమాటముగ చర్చింపబడుచుండెడివి. 1914 వరకు జరిగిన సత్యాగ్రహ సమరచరిత్ర గాంధీజీ వ్రాతలు యీ పత్రికద్వారా ప్రజలను త్తేజపరచుచు నతని మనఃపరిపాకమునకు దర్పణమువలె నుండెను.

ఈసమయములోనే డర్బను నగరమునకు 14 మైళ్లదూరములో 'ఫొనిక్సు' ఆశ్రమము స్థాపింపబడెను. ఈయాశ్రమ స్థాపనాచార్యుడే నూతనయుగారంభకుడు. సత్యాగ్రహ తంత్రవిధాత, కర్మయోగి, సన్యాసి, వేదాంతి, మహావీరుడు. భక్తుడు, ప్రేమమూర్తి, మార్గదర్శి. గాంధీజీ యొకవంక దక్షిణాఫ్రికా ప్రభుత్వముతో పోరుచు వారి కాపదవచ్చినపుడెల్ల తనయుద్యమము నాపుచు వారికి తోడ్పడుచుండెను, 1906లో జూలూలు నేటాలు ప్రభుత్వముమీద తిరుగబడిరి. అతడు వెంటనే తనయుద్యమము నాపివేసి యుద్ధసేవకదళమునకు నాయకుడై ప్రభుత్వమన్ననలను బడసెను. అదిముగియుటతోడనే యథాప్రకారము తనపని ప్రారంభించెను. ఈయపూర్వవిధాన మతని యనుచరులకే యర్థముకాక తమకు ద్రోహము చేయుచున్నాడని కొందరతనిని తీవ్రముగ విమర్శించి 'ఆసియావాసులకొరకధికారులు' అను హోదాతో ప్రజలను రక్షించుట కొరకు కొందరు నియమింపబడిరి. వీరు న్యాయమైనవారిని రక్షింపక లంచపంచములిచ్చిన వారిని చేరదీసి ప్రజలను భక్షింప నారంభించిరి. గాంధీజీ యీలంచగొండులసమస్యను చేబట్టవలసివచ్చెను. అతడుతగిన సాక్ష్యములను సేకరించి వారిని వేటాడ మొదలు పెట్టెను. వీరందరిని పట్టివేయుట కతనికి రెండేండ్లుపట్టెను. వారు చేసెడి దోషములయందే కాని వారియం దతనికెట్టి ద్వేషము లేదు, కనుకవా . .

కష్టములు కలిగినపుడతడు వారికి సాయపడుచుండెను. అత డజాతశత్రువనుటకిక నెట్టి నిదర్శనము కావలెను?

చివరకతడు తన జీవితమునంతను ప్రజాసేవకే వినియోగింపనెంచి జొహాన్సుబర్గులో నతనికివచ్చు 15,000 డాలరుల ప్రాక్టీసు (డాలరు రు. 3-8-0) విడిచిపెట్టి ఫొనిక్సు ఆశ్రమము స్థాపించి, బ్రహ్మచర్యదీక్షబూని తనతో కొంతమంది యూరపియనులను, భారతీయులను జేర్చుకొని నిరాడంబర జీవితమును వరించి 1914 వరకు కనివిని యెరుగని సత్యాగ్రహమును నడిపి ప్రపంచమును దిగ్భ్రమనొందింప జేసెను.

# సత్యాగ్రహము

ఈ దక్షిణాఫ్రికా సత్యాగ్రహము 1906లో ప్రారంభమై యెనిమిదేళ్లుపట్టి 1914లో పూర్తియయ్యెను. 1906 లోనే భారతదేశములో వందేమాతరోద్యమము ప్రారంభమయ్యెను. 1906 లోనే ఐర్లండులో సిన్ ఫీన్ స్వాతంత్ర్య యుద్ధము ప్రారంభమయ్యెను. కాని గాంధీజీ యుద్యమమునకు వీటికి పోలికలేదు. భారతీయులు బోయరు యుద్ధములో తెల్లవారికి సాయపడిరి. దీనికి బహుమతిగ కాబోలును ట్రాన్సువాలులో భారతీయులపై నొక యమానుష చట్టము ప్రయోగింపబడెను. ట్రాన్సువాలు రావలసినదని యతనికి తంతివార్తలు కురిపింపబడెను. అతడా చట్టములోని వివరములను, యదార్థమును కనుగొని నివ్వెరపడెను. అవి భారతీయులను నాశముచేయు యమపాశములని వాటిని చూచీ చూచుటతోడనే యతడు కనిపెట్టెను.

ఎనిమిదేండ్లుదాటిన ప్రతిస్త్రీ పురుషుడు భారతీయుడు, ట్రాన్సువాలులో నుండుటకు తనపేరు రిజిస్ట్రారువద్ద నమోదు చేయించుకొనవలెను. కులము, వృత్తి, నివాసము చెప్పుకొని బొటనవ్రేలు ముద్రవేయవలెను, తమతమ గుర్తులను చూపవలెను. అట్లు నిర్ణయింపబడిన తేదీలోపున రిజిస్టరు చేయించుకొననిచో ట్రాన్సువాలునుండి వెడలిపోవలెను. ముందుగా

దరఖాస్తు చేయకపోయినను జుల్మానా, శిక్ష లేదా దేశము నుండి వెడలనంపుట. పిన్నల తరపున సంరక్షకులు, లేదా పెద్దలైన తరువాత తామే దరఖాస్తులు పంపవలెను. పర్మిటు లను పోలీసువారడిగిన తక్షణం చూపవలెను, రాచబాటలలో నడచు నపుడైనను వాటిని చూపితీరవలెను. గృహస్థుల యిండ్లలోదూరి పోలీసులు లైసెన్సుల నడుగవచ్చును. కోర్టులకు రెవిన్యూయధికారుల వద్దకు వెళ్లినపుడుకూడ లైసెన్సు లుండవలెను. అనగా భారతీయుడు తనయొంటి మీద ఎల్లప్పుడు నీ లైసెన్సుల నుంచుకొనవలెను.

ఇట్టి నిర్బంధకాండను గాంధీ యెప్పుడు యెచ్చట చూడ లేదు; వినలేదు. ఈవిషయము లచ్చటి భారతీయులను కలచి వైచెను. వెంటనే 1906 సెప్టెంబరు 11వ తేదీని గొప్ప సభ యేర్పాటు చేయబడెను. నలువైపులనుండి యనేకమంది ప్రతి నిధులు వచ్చిరి. సభలో చట్టములోని యంశములన్నియు, పూసగ్రుచ్చినట్లు చెప్పబడెను. చట్టధిక్కారమువలన కలుగు ఫలితములు వర్ణింపబడెను. సభయంతయు క్రిక్కిరిసియుండెను. భగవంతుని సాక్షిగనిడుకొని ప్రతివాడు ముందుకురికెను.

చట్టమును ధిక్కరించుటకు తగినచర్యలన్నియు తీసికొన బడి యనేక విజ్ఞప్తులు పంపగా స్త్రీలకు సంబంధించినంతవరకే శాసనసభవారు చట్టమును సవరించి తక్కినదాని నంతను యామోదించిరి. ఇంతమాత్రముచే భారతీయులు తృప్తి పడలేదు. ప్రజల యుత్సాహము మిన్నంటుచుండెను.

ఇంగ్లండుకు రాయబారము పంపబడెను, దానిఫలితముశూన్యమయ్యెను. వెంటనే సత్యాగ్రహము ప్రారంభమయ్యెను. అధికారులెంత గింజుకొనినను రిజిష్టరు చేయించుకొనుట కొక్కడును రారైరి. జూలై 31వ తేదీ గడువుదాటిపోయెను. రామసుందరుడు అను పండితుడు మొదటివాడు, తంబినాయుడు రెండవవాడు, మూడవవాడు గాంధీజీ. సత్యాగ్రహమునకు మూలపురుషుడు కనుక తనకు దిట్టముగా వడ్డించవలసినదని గాంధీజీ యధికారులను కోరెను. రెండుమూడు రోజులు దాటగానే రోజురోజుకు సత్యాగ్రహులసంఖ్య లెక్కకు మించుచుండెను.

చీనా దేశస్థులు కూడ యీ సత్యాగ్రహుల జట్టులో జేరిరి. సత్యాగ్రహులపంట నిత్యము పెరుగుచుండెను. పట్టము తిరుగకుండ ప్రభుత్వము రాయబారులను పంపప్రారంభించెను. తమంతతాము వేలుముద్రలు వేయుచో నిర్బంధశాసనము రద్దుచేయబడునని ప్రభుత్వము తెలిపెను. ఈ రాజీపద్ధతికి గాంధీజీ యంగీకరించెను. దీనికుగ్రుడై మీరాలం అను నొక పఠాను మరికొందరు గాంధీజీని తీవ్రముగా కొట్టిరి. అతడు 'హే రాం' యనుచు నేలగూలెను. కాని కొట్టినవారిమీద నతడెంతమాత్రము కినుకవహింపలేదు. ఏ చర్యయు తీసికొనలేదు.

ఈవార్త తెలియుటతోడనే భారతీయులలోనే యెంతయో అలజడి బయలుదేరెను. అతనిని చూచుటకు ప్రజలు

తండోపతండములుగ వచ్చుచు నతనిని కొట్టినవారిమీద నాగ్రహావేశులగుచుండిరి. పదిరోజులవరకు నతని కారోగ్యము కలుగలేదు. అతనిని కొట్టినవారిమీద నతడేగను ఫిర్యాదియు లేదు. అచ్చటి ప్రభుత్వమునకే యిది యాశ్చర్యకరమయ్యెను. అతని ననుసరించి యందరు వేలుముద్రలు వేయ నారంభించిరి. స్వచ్ఛందముగ వేలుముద్రలు వేసినయెడల నాచట్టము రద్దు చేయబడునని ప్రభుత్వ మొప్పుకొని చివరకు స్మట్సు సేనాని వాగ్దానభంగ మొనర్చి దానిని శాసనము చేయ బెట్టెను. ఉత్తరములు రాయబారములు విఫలములయ్యెను. ఆ బిల్లు చట్టము చేయబడిన దినముననే యిదివరకు ప్రజలు పొందిన ధృవపత్రములన్నియు తగులబెట్టబడెను. ట్రాన్సువాలులో క్రొత్తవారు ప్రవేశింపరాదను చట్టమును కూడ ధిక్కరించి ప్రజలు తండోపతండములుగ వచ్చుట ప్రవేశించిరి. ఈ ప్రజా ప్రవాహము నాపుటకు జుల్మానాలు, శిక్ష, ప్రవాసము-ఏక కాలమందే ప్రయోగింపబడుచుండెను. గాంధీజీకి కూడ శిక్ష విధింపబడెను. కొట్టినను, తిట్టినను, తిండి పెట్టకపోయినను చట్టవిధ్వంసకుల సంఖ్య పెరుగుచునేయుండెను. ప్రవాస శిక్షలు హెచ్చగుటతోడనే భారతదేశములో నాందోళన తీవ్రతరమయ్యెను. ఇంకొక రాయబారము కూడ విఫలమయ్యెను.

ఉద్యమము చాలకాలము పట్టుచుండెను. సత్యాగ్రహుల కుటుంబముల నొక్కచోటకు చేర్చవలసివచ్చెను. 1100

యకరముల భూమిలో 'టాల్‌స్టాయి క్షేత్రము' స్థాపింపబడెను. ఇది దేవతలు చూడదగిన క్షేత్రముగ నుండెను. ఈ క్షేత్రవాసులు తేనెటీగలవలె పనిచేయుచు తమ బాలబాలికలకు పాఠశాలలు, కర్మాగారములు, పరిశ్రమలు, పారిశుధ్యము, విజ్ఞానము, మత బోధ - నిజమానవాభివృద్ధికి కావలసిన సమస్తము కల్పింపబడెను. ఇచ్చట జీవితమాదర్శప్రాయముగ నుండెను. సత్యాగ్రహులు జయిలుకు పోవుచు వారంటు లేకనే కోర్టుకు హాజరగుచుండెడివారు. ఈ విధముగ 1912 అక్టోబరు వరకు జరిగెను.

భారత దేశములో దక్షిణాఫ్రికా పోరాటము ప్రజల నాకర్షించెను. భారత ప్రభుత్వమును ప్రజలు ప్రశ్నింపనారంభించిరి. గోపాలకృష్ణగోఖ్లే దీనిని గురించి శ్రద్ధవహించి శాసనసభలో ప్రశ్నలను కురిపించుచు భారత కార్యదర్శితో సంప్రదింపులు జరుపుచు విషయములను స్వయముగ తెలిసికొనుటకు 1912లో దక్షిణాఫ్రికాలో సంచారము చేసెను. అచ్చటి మంత్రులతో మాట్లాడి యాపర్యవసానము గాంధీజీ కెరిగించెను. తలపన్ను, జాతివిద్వేషము, నిర్బంధచట్టములు తొలగిపోవునని యతడు గాంధీజీతో చెప్పెను. కాని యతనికి నమ్మకము చిక్కలేదు. గోఖ్లే గొప్పవ్యక్తి. భారత ప్రభుత్వములో పలుకుబడి కలవాడు. వారికి మిక్కిలి యిష్టుడు. తన వాక్యములు తథ్యములని యతడు దక్షిణాఫ్రికాలో పదే పదే ప్రచారము చేసెను. అతడు తన ప్రచారము

ముగించుకొని భారతదేశము మరలుటతోడనే తిరిగి మామూలు పాతమే, వాగ్దానభంగమే జరిగెను. టాల్‌స్టాయి క్షేత్రవాసులలో నూతన సంచలనము బయలుదేరెను. ఈసారి యచ్చట స్త్రీలందరు రంగములోని కురుకుటకు తహతహ లాడుచుండిరి.

ఇప్పుడొక విచిత్ర సంఘటన జరిగెను. అచ్చటి భారతీయులు తమ శాస్త్రము ప్రకారము చేసికొనిన వివాహము లెప్పుడును శంకింపబడలేదు. కాని 1913 మార్చి 14వ తేదీని కేపుకాలనీ జడ్జి యొక విచిత్ర తీర్పుచెప్పెను. ఆ దేశములో క్రైస్తవమతాచారము ప్రకారము జరుగు వివాహములే చెల్లుననియు, నవి రిజిష్టరు కాబడవలెననియు తీర్పుచెప్పెను. తక్కిన వివాహములు చెల్లవు. అవి వివాహములుగ పరిగణింపపబడవు. వారి బిడ్డలు న్యాయశాస్త్రరీత్యా గుర్తింపబడరు. దీని వలన నచ్చటి హిందువులు, మహమ్మదీయులు, పార్సీలు తమ గృహజీవితములకే ముప్పువాటిల్లుట వలన దీని నెదిరించుటకు కంకణము కట్టుకొనిరి. దీని వలన వారి కుటుంబములు, ఆస్తులు, వంశపారంపర్యహక్కులు సమస్తము విచ్ఛేదము కానున్నవని వారు గ్రహించిరి.

ఈ ప్రజలందరకు గాంధిజీయే శరణ్యము. వారతని తీర్పుకై వేడుకొనిరి. ఈ తీర్పును ప్రభుత్వ మంగీకరించుచున్నదా యని యతడు ప్రశ్నింపగా ప్రభుత్వము జవాబు చెప్పక మిన్నకుండెను. దేశములో నెంతయో యలజడి

జరుగుచున్నను ప్రభుత్వ లింగశరీరమునకు వెష్టకలుగలేదు. ప్రజాందోళన వారి చెవికెక్కుటలేదు. స్త్రీలలో బయలు దేరిన సంచలనమునకు మితిలేకయుండెను. టాల్‌స్టాయి క్షేత్రములోని స్త్రీలందరు సత్యాగ్రహముచేయ శపథము బట్టిరి. ఎన్ని కష్టములైన సైరించుటకు వారు ప్రతిన బూనిరి. గాంధిజీ యొక నిశ్చయమునకు వచ్చెను. అతడు మొదట ఫొనిక్సు ఆశ్రమవాసులనందరను ట్రాన్సువాలులో ప్రవేశింపమని యాజ్ఞాపించెను. అది కేవలమతని యాజ్ఞయే కాదు, ప్రజలే యతనిని తొందరపెట్టుచుండిరి. ఈ సందర్భములో కస్తూరీబాయి గాంధీజీల మధ్య జరిగిన సంభాషణ వర్ణింపతగినది. అతడామెతో సత్యాగ్రహమును గురించి చెప్పక తదితరులతో మాత్రమే చెప్పెను. తనతో చెప్పక పోవుటకు తన దోషమేమని యామె గాంధీని ప్రశ్నించెను. ‘అది నీయిష్టము. ఈ విషయములో నీకు సంపూర్ణస్వేచ్ఛ కలదు’ అని యతడనెను. చివరకామెయే ఫొనిక్సు ఆశ్రమ వాసులజట్టుకు నాయకురాలయ్యెను. 1913 సెప్టెంబరులో వీరికి మూడుమాసముల శిక్ష విధింపబడెను. ట్రాన్సువాలు లోని స్త్రీలు నేటాలులో ప్రవేశించిరి. కాని వారినెవరిని నిర్బంధింపలేదు. వారచ్చటనుండి న్యూకేసిల్ వెళ్లి యచ్చట బంగారుగనులలో పనిచేయు వారికి బోధించిరి. వారీ తలపన్ను గాథ విని పనిచేయుట మానివేసి సమ్మె చేసిరి.

దీనితో ప్రభుత్వ క్రోధానలము హెచ్చెను. సమ్మెదారు లందరకు మూడేసి మాసముల శిక్ష విధించిరి.

ఈ వార్తలతో భారతదేశము దద్దరిల్లిపోయెను. దక్షిణాఫ్రికా ప్రభుత్వచర్యలకు తనరక్తముడికి పోవుచున్నదని సర్ ఫిరోజిషామెహతా గర్జించెను. న్యూకేసిల్ గనులలో పనిచేయు కూలివాండ్రందరు వేనకువేలు తమపనిముట్లులు పారవేసి బిడ్డలను చంకనిడుకొని, మూటలను నెత్తిన బెట్టుకొని తీర్థయాత్రకు బంగాలు కేరినట్లు [illegible] జేరిరి. ఈ మానవ ప్రవాహము నేల యీనినట్లుండెను. వీరికిండ్లు లేవు. భోజనమునకు న్యూకేసిల్ వర్తకులు కావలసినంత సామగ్రి సరఫరా చేసిరి. వినీలాకాశ చ్ఛాయలక్రింద వంటలు, వసతులు కల్పింపబడెను. గాంధీజీ నాయకత్వము క్రింద సత్యాగ్రహయాత్రికులు 36 మైళ్ళు న్యూకేసిల్ నుండి ట్రాన్సువాలుకు వచ్చుటనుండి ఛారెల్సు పట్టణము, అచ్చట నుండి ప్రిటోరియా-యీవిధముగా జైత్రయాత్ర సాగించిరి. గాంధీజీ స్మట్సుసేనానికి ప్రజల కోరికల నెప్పటికప్పుడు స్పష్టపరచుచునే యుండెను. సమ్మెదారులను కాల్చివేసెదమని, పేల్చివేసెదమని యూరపియనులు నోటిటపాకాయలు పేల్చుచుండిరి. గాంధీజీని నాలుగు రోజులలో మూడుసార్లు పట్టుకొని విడిచి పెట్టుచువచ్చిరి.

చివరికతనికి శిక్ష విధించిరి. తక్కిన యాత్రికులను కూడ పట్టుకొని యొకదొడ్డిలో పెట్టి పనిచేయమని నిర్బంధించిరి.

పనిచేయనందులకు వారిని [illegible] కొట్టిరి. ఈ వార్త లన్నియు భారతదేశ [illegible] బడుచుండెను. భారతదేశములో సత్యా[illegible]హాయక సంఘము లేర్పరుపబడెను. వైస్రాయి [illegible] హార్డింజి ప్రభువు దక్షిణాఫ్రికా ప్రభుత్వచర్యలను [illegible]ముగ విమర్శించెను. అన్ని చోట్ల కూలీలందరు [illegible]రి. ప్రభుత్వమువారు వారి నందరను బెదిరించి, యదిలించి చూచిరి. వారిప్రయత్నము లన్నియు నిష్ఫలములయ్యెను. జయిళ్ళలో కొంతమంది మరణించిరి. వేలకొలదిగా వచ్చు సత్యాగ్రహులను జయిళ్ళలో నుంచుట యసాధ్యమయ్యెను,

1913 డిసెంబరులో గాంధీజీని విడిచివేసి యీసంకటస్థితి నుండితప్పించుకొనుట [illegible]యని ప్రభుత్వము చింతించుచుండెను. ఇదేస[illegible] యూరపియనులు ప్రభుత్వ రైల్వేపనులనుండి [illegible]చేసిరి, ఈ సత్యాగ్రహులు వారికి తోడ్పడుదురని ప్రభుత్వము భయపడెను. కాని గాంధీజీ సిద్ధాంతమపూర్వమైనది. అది ప్రపంచమునకే వెలుగుబాట. శత్రువు నాపదలోనుండగా చికాకు పరచరాదని యతని మతము. అతని నాయాపదనుండి రక్షించి తరువాతనే యతనితో ఢీకొనవచ్చునని యతని మతము. ఈ ధర్మసూత్రమే పాశ్చాత్యుల నాశ్చ[illegible]లను చేసి చివరకు నిరాయుధులనుగ కూడ చేయగలిగెను. వారికి [illegible]బాం[illegible], సింహము, మెలుగుగొడ్డు, (ఇవి వారి జెండాలమీది చిహ్నములు)

శాస్త్రముతే తెలియును కాని యిట్టి నవీన సత్యాగ్రహ శాస్త్రము తెలియదు. ఈ సత్యాగ్రహ చరిత్రలో ననేక వీర గాథలు, దేవతలచే కన్నీరు కార్పించు ఘట్టములు కలవు.

స్మట్సు సేనాని కొండమీద నుండి దిగక తప్పినది కాదు. స్మట్సు గాంధీజీలమధ్య యుత్తర ప్రత్యుత్తరములు జరిగెను. వారి మధ్య నొకయొడంబడిక కుదిరెను. సత్యాగ్రహము విరమింప బడెను. సత్యాగ్రహుల కోరికలన్నియు కమిషను వారి సిఫార్సుల పేరిట నంగీకరింపబడెను.

మూడు పౌనుల తలపన్ను తీసివేయబడెను. భారత దేశములో శాస్త్రీయముగ నెంచబడు వివాహములన్నియు నంగీకరింప బడెను. వేలుముద్రలశాసన మంతరించెను. మూడు వేలమైళ్ళ దూరములో నెనిమిది వత్సరములొక యపూర్వ పోరాటము జరిపిన మీదట సత్యాగ్రహము విజయవంతమయ్యెను. 1914 జూలై 18వ తేదీని గాంధీజీ దక్షిణాఫ్రికా నుండి భారతదేశము తరలివచ్చెను.

# భారతాగమనము

దక్షిణాఫ్రికా నుండి బయలుదేరి గాంధీజీ అగష్టు 6వ తేదీకి లండను చేరుకొనెను. 1914 అగష్టు 4వ తేదీని మొదటి ప్రపంచ యుద్ధము ప్రకటింపబడెను. గోఖ్లే మధ్యత్రోవలో చిక్కుకొనెను. అతనిని కలుసుకొనిన తరువాతనే గాంధీజీ భారతదేశము రాగోరెను. ఈ యుద్ధకాలములో తానేమి చేయవలెనను సమస్య యతనిని బాధించెను. అతడహింసా వ్రతుడు, "రెండు దేశములు యుద్ధములో నున్నపుడతడు వారి నాపు చేయవలెను. కాని యతడసమర్థుడైనపుడు యుద్ధమునకు వెనుక నుండి పాల్గొనుచు తనను తన దేశమును ప్రపంచమును యుద్ధమునుండి తప్పించుటకే హృదయపూర్వకముగ ప్రయత్నింపవలెను." అని యతడు నిశ్చయించి మిత్రమండలికి సాయము చేయుటకే తీర్మానించుకొనెను.

ఇంగ్లండులో నుండగా సామ్రాజ్య సైన్యములు నావికాదళము నతనికి రక్షణ యిచ్చుచున్నవి. సామ్రాజ్యము ద్వారా భారతదేశ మభివృద్ధి చెందవచ్చునని యతడు భావించెను.

కొంతమంది యీ దేశమందుమున బ్రిటిషువారిపై పగదీర్చుకొనవలెనని రి అది యతనికి నచ్చలేదు. క్రూ ప్రభువు కతడొక లేఖ వ్రాసెను. గాంధీజీ సూచన కతడంగీకరించెను.

ఎనభై మంది విద్యార్థులు సైనిక వైద్యదళ శిక్షణపొందుట కంగీకరించిరి. స్త్రీల క్లబువారు యుద్ధభటులకు దుస్తులు కుట్టియిచ్చుట కంగీకరించిరి. శ్రీమతి సరోజినీదేవి యీ సంఘములో సభ్యురాలు. గాంధీజీ కామెతో పరిచయ మప్పుడే కలిగెను. ఈ దళమునకు గాంధీజీయే యధిపతి. కాని వారికి శిక్షణయిచ్చుటకు నియమింపబడినవారు ఆక్సుఫర్డు బి. ఏ:లు. వారు వీరిమీద పెత్తనము సాగింప మొదలుపెట్టిరి ఈ దళములోని సభుల్యుగాంధిజీకీవిషయము నెరుకపరచగా అతడు తగిన యుత్తర ప్రత్యుత్తరములుజరిపి చిన్న సత్యాగ్రహము కూడ పూనవలెనను కొనుచుండెను.

ఇంతలో యుద్ధములో గాయపడినవారు కుప్పలుగ వచ్చి పడుచుండుటచే భారత యుపకార్యదర్శి యనేకసారులు గాంధిజీని కలుసుకొని యతని దళమునకు ప్రత్యేక యేర్పాటులుగావించి యతనిని సంతృప్తిపరచెను. లండనులోనుండగ గాంధిజీ యారోగ్యము చెడిపోయెను. గోక్లేసురక్షితముగ లండను చేరుకొనెను. వారుభయులు మాట్లాడుకొనిరి. భారతదేశము వెళ్లినగాని యారోగ్యము చేకూరదని వైద్యులతనికి సలహాచెప్పిరి. వారి సలహాప్రకారమతడు గృహోన్ముఖుడయ్యెను.

అతడు బొంబాయి చేరకపూర్వమే ఫొనిక్సు ఆశ్రమవాసులు భారతదేశము చేరుకొనిరి. కాంగ్రీగురుకులములో వారు మొదట కొంతకాలముండిరి. స్వామి శ్రద్ధానంద వారిని

తనబిడ్డవలె నాదరించెను. తరువాత వారు శాంతి నికేతన మునకు వెళ్లిరి. రవీంద్రనాథ టాగూరు అతని శిష్యులు వారి నత్యాప్యాయముతో చూచిరి. గాంధీజీ బొంబాయిలో దిగగానే యతనికి ఘనమగు స్వాగత మీయబడెను. గవర్నరుదగ్గరనుండి యతని కాహ్వానము వచ్చెను. గాంధీజీ గవర్నరునుచూచెను. అప్పుడు గవర్నరు విల్లింగ్డను ప్రభువు, "నేను మిమ్మొక విషయము గోరుచున్నాను. మీరు ప్రభుత్వముపై నేదేని చర్యతీసి కొనదలచినచో ముందుగా నాతో చెప్పగోరుచున్నాను" అని కోరెను. అది గాంధీజీసిద్ధాంతమే. ప్రభుత్వముతో చెప్పకుండ వారికి తగినంతవ్యవధి యీయకుండ నతడేయుద్యమము నడుపలేదు. కనుక తనతత్త్వము నతడు విదశపరచి యది తనప్రథమ సూత్రమేయని వెల్లడిచేసెను.

అతడు బొంబాయినుండి పూనా వెళ్లెను. గోఖ్లే, అతని శిష్యులు నతని యెడల నపారప్రేమ చూపిరి, వారందరు కలసి యన్ని విషయములు చర్చించుకొనిరి. తన యాధిపత్యముననున్న 'భారత సేవక సంఘములో' చేరవలసినదని యతనిని గోఖ్లే కోరెను. కాని తక్కిన సభ్యులకిది యంతగా రుచింపలేదు; ఈ సూచన వారికి నచ్చలేదు. గాంధీజీ మెచ్చుటనున్నను, నేమిచేయబూనినను తన యాశ్రమమున కగుఖర్చు తానే భరించెదనని గోఖ్లే యనగా ఆయున యుదారతకు గాంధీజీ సంతసించెను. కొంతకాలమచ్చట నుండి యతడు రాజకోట, పోర్బందరు గ్రామములకు పయన

మయ్యెను. అప్పుడు వీరంగాం, వాధ్వాన్ గ్రామములలో ప్లేగు ముమ్మరముగ నుండెను. గాంధీజీకి కొద్ది జ్వరము పోకెను. ఒక యిన్‌స్పెక్టరు అతని పేరు వ్రాసికొని యాయనను రాజకోటలోనున్న యొక పెద్ద ఆఫీసరువద్ద హాజరుకమ్మని చెప్పెను. అతడట్లు హాజరుకాగా నా యధికారి యతని పేరు విని సిగ్గుపడి క్షమాపణ వేడుకొనెను.

మోతీలాల్ అను నొక దర్జీయతనిని కలుసుకొని ప్లేగు నిబంధనల వలన మూడవ తరగతి రైలు ప్రయాణీకులు వీరంగాంవద్ద ననుభవించుచున్న కష్టములను విన్నవించెను. 'నీవు జయిలుకుపోవుటకు సిద్ధముగానుంటివా?' యని గాంధీజీ యతని నడిగెను. 'మీరు నాయకత్వము వహింతురేని మేమన్నింటికి సిద్ధమేయగుదుము మీరు కథియావాడు వాసులు. కనుక మీపై మాకు హక్కుకలదు.' అని యుతడు గంభీరముగా పలికెను. గాంధీజీకి ఆ వార్తను తెలిసి పోయెను. అతడెచ్చటకు పోయినను వీరంగాం గాథయే విని పింపబడుచుండెను. ఈ విషయమును గురించి సముజాయిషీ యంతయు నతడు సేకరించి నిజము తెలిసికొనెను. ప్రజల యారోపణలలోని సత్యమతనికి ద్యోతకమయ్యెను.

వెంటనే యతడు బొంబాయి ప్రభుత్వముతో నుత్తర ప్రత్యుత్తరములు జరిపెను. గవర్నరు విల్లింగ్డను కతడీ విషయమునంతను చెప్పగా దీని బాధ్యత యంతయు భారత ప్రభుత్వముదేయని తనది కాదని యతడు తప్పుకొనెను.

గాంధీజీ యంతటితో నూరకొనక భారత ప్రభుత్వముతో సంప్రదింపులు ప్రారంభించి రాజప్రతినిధియైన చెల్మ్స్‌ఫర్డు ప్రభువును కలుసుకొని వివరములను తెలియబరచగా నతడాశ్చర్యపడి తనకీ విషయమేమియు తెలియదని యానిమిషమందే వీరంగాం కాగితము లన్నింటిని తెప్పించుకొనెను. ఇది జరిగిన కొద్దిరోజులలోనే వీరంగాంనిబంధనలన్నియు తొలగింపబడెను. ఈ వార్త పత్రికలలో ప్రకటింపబడి ప్రజలకు తెలియపర్చబడెను.

ఇది భారత దేశములో సత్యాగ్రహోపక్రమణికగా భావింపబడెను. అతడు కథియవాడులోని బగసరయను చోట నుపన్యసించుచు 'సత్యాగ్రహము' అనుపదము నుపయోగించెను. 'ఇది మమ్ము భయపెట్టుట కాదా! సర్వశక్తివంతమైన ప్రభుత్వ మీ బెదరింపులకు భయపడుననుకొందురా?' అని బొంబాయి ప్రభుత్వ కార్యదర్శి గాంధీజీతో బ్రువ్వెనట. "ఇది బెదిరింపుకాదు. ఇది ప్రజలను ప్రబోధించుట. ప్రజల కష్టములను నివారించుకొనుటకు గల న్యాయమైనమార్గములను వారికి చూపుట నావిధి. తన నిజాధికారమును పొందగోరు జాతి యన్ని స్వాతంత్ర్య మార్గములను, సాధనలను తెలిసికొనవలెను. సాధారణముగ దౌర్జన్యము దీనికి కడగొట్టుమార్గము. సత్యాగ్రహము కేవలము దౌర్జన్యరహిత మార్గము. అది యాచరణలో నెట్లుండవలెనో, దాని హద్దు

లేవియో చెప్పుటనాపిధి. 'బ్రిటిషు ప్రభుత్వము శక్తివంత మైనదగుట ముమ్మాటికి నిజము. దానికెట్టి సందేహము లేదు. కాని సత్యాగ్రహము కూడ దివ్యౌషధమే యను టకు సందేహము లేదు.' అని గాంధీజీ బదులు చెప్పెను. ఇట్టి గంభీర ప్రతివచనములను బ్రిటిషు అధికారు లదివర కెన్నడు వినియుండక పోవుటచే నా ప్రభుత్వ కార్యదర్శి డిల్లహోయి చేయునదిలేక "చూచెదముగాక" యనుచు తల పంకించుచు తో్క ఝూడించెను.

# సత్యాగ్రహాశ్రమ స్థాపన

## 25-5-1915

తనయాశ్రమ నాసులతోగూడి గాంధీజీ భారతదేశము నకు తరలివచ్చెను. గోఖ్లే, శ్రద్ధానంద, రవీంద్రనాథటాగూరు ప్రభృతి పెద్దలందరు నతని సహాయము చేసిరి. హరి ద్వారములోనే తన యాశ్రమమును స్థాపింప వలసినదని శ్రద్ధానందస్వామి కోరెను. రాజకోటకు రమ్మని కొందరు మిత్రులు కోరిరి. కలకత్తా స్నేహితులు వైద్యనాథము బాగుండునని సూచించిరి. అహమ్మదాబాదు వారి బలవం తము మరింత హెచ్చయ్యెను. ఆశ్రమమునకు తగిన వసతుల నన్నింటిని వారే కల్పించుట కంగీకరించిరి.

ఆశ్రమ ఖర్చు యావత్తు భరించుటకు వెంటనే వాగ్దాన ములు వచ్చెను. గాంధీజీ కూడ అహమ్మదాబాదే బాగుండు ననియు తాను గుజరాతు వాడగుటచే గుజరాతు భాష ద్వారా యెక్కువ దేశసేవ చేయుట కవకాశముండుననియు నిశ్చయించెను. అహమ్మదాబాదు గుజరాతుకు రాజధాని. అచ్చట ధనసహాయమునకు కొదువయుండదు. 1915 మే 25వ తేదీని గాంధీజీ తనయాశ్రమము నచ్చట స్థాపించెను.

1906లో ఫొనిక్సులో ఆశ్రమమును స్థాపించిన తపస్వియే భారతసీమలో తిరిగి సత్యాగ్రహాశ్రమమును స్థాపించెను

బ్రిటిషు ప్రభుత్వమునకు, నాయకులకు, ప్రజలకుగూడ నీ యాశ్రమ స్థాపనాచార్యుని పటిమ యింకను తెలియకపోవు టచే 'శమ ప్రధానేషు తపోధనేషు గూఢం హిదాహాత్మ కమస్తి తేజః' అని కాళిదాసకవి రచించినట్లు లోకమునుదహిం పజేయు శక్తియే కాక వెలిగింపచేయు శక్తికూడ యీ యాశ్రమములో ప్రజ్వరిల్లు చున్నదని తెలియలేదు. ఆశ్రమ నిర్వహణకు కొన్ని నియమములు, విధులు నేర్పరుపబడెను. అస్పృశ్యతను పాటింపరాదను నది యొకముఖ్య నియమము. ఈ యాశ్రమమునకు పేరు పెట్టుటలోకూడ కొంత చర్చ జరిగెను. తపోవనము, సేవాశ్రమము యిత్యాది పేరులు సూచింపబడగా సత్యాన్వేషణ, సత్యనిరతిగాంధీజీ ప్రధానా శయములగుటచే సత్యాగ్రహాశ్రమము అను పేరు స్థిరపరుప బడెను. ఈ యాశ్రమములో మొదట పదముగ్గురు తమిళు లుండిరి. వీరిలో నయిదుగురు దక్షిణాఫ్రికా నుండి వచ్చిన వారే. మొత్తము 25మంది స్త్రీ పురుషులుండిరి. అందరికు నొకే వంట. అదియొక కుటుంబము. బ్రహ్మచర్యము, నిరాడంబరజీవితము, మానవసేవ, స్వావలంబన వారినియ మములు.

ఆశ్రమమును స్థాపించిన కొద్దిమాసములకే యందులో నొక యస్పృశ్య కుటుంబమును జేర్చుకొను సమస్య వచ్చెను. అమృతలాల్ థక్కర్ గాంధీజీవిషయము వ్రాసెను. అతడందుల

కంగీకరించెను. ఆశ్రమవాసులును దీని నామోదించిరి. కాని దీనివలన సక్రమముగ కొన్ని చిక్కులు కలిగెను. నూతినుండి నీరుతోడుకొనుటలో కొంతయడ్డంకి కలిగెను. తోటవాడు తిట్టుట ప్రారంభించెను. ఆశ్రమమునకుసహాయము చేయువారిలో కొంతయలజడి కలిగెను. దాని వలన క్రమముగ ద్రవ్యసహాయము కొంత తగ్గనారంభించెను. దీనితో పాటు సాంఘిక బహిష్కార వదంతులుకూడ బయలు దేరెను. ఆశ్రమ వాసులందరు దానికి సంసిద్ధులయి యేయుండిరి. అవసరమగుచో హరిజనవాడలో నివసించుటకు కూలి చేసికొని జీవించుటకు వారు సంకల్పించుకొనిరి.

ఇంతలో మగన్ లాల్ 'ధనమైపోయినది. ముందునెలకు చేతిలో పైసలేదు' అనిగాంధీజీకి సూచించెను. పలుగులు, పారలు, తట్టలు పుచ్చుకొని పనిచేయుట కందరు సిద్ధపడిరి. గాంధీజీ యికయాజ్ఞాపించుటయే మిగిలియుండెను. ఇట్టి పరీక్షలు గాంధీజీ కనేక సారులు తటస్థించెను. భగవంతుడతనికి సహాయము పంపుచుండెను. ఇట్లుండగ నతనిదర్శనము కొరకొకవ్యక్తి వచ్చెను. అతడాశ్రమము వెలుపలనేయుండి గాంధీజీని దర్శించుట కొరకువచ్చినట్లు చెప్పెను. గాంధీజీ యాశ్రమ ముఖద్వారము వద్దనుండెను. ఒకశ్రేష్టి కారులోనుండి దిగి 'నేను మీయాశ్రమమునకు కొంతసాయము చేయవచ్చితిని.. దానిని స్వీకరింప గోరుచున్నాను' అనివేడుకొనెను. గాంధీజీ

దానికంగీకరించెను. 'రేపుసరిగా యిదే సమయమునకు సేవ వచ్చెదను'. అని చెప్పి యిప్పించుకొని యాశ్రేష్ఠి వెడలి పోయి మరునాడు సరిగా యాసమయమునకే వచ్చి గాంధీజీ చేతిలో రు 13,000 కరెన్సీనోట్లుపెట్టి పేరు చెప్పకుండగనే కాదుబ్ర మనిపించెను. ఆధనముతో నొకసంవత్సరమెట్టి కష్టములేకుండ ఆశ్రమము నిర్వహింపబడెను.

# వారణావతోదంతము

భారతీయులకు వారణావతము లేక కాశికాపురి యతి పవిత్రక్షేత్రము. ఇదియతిపురాణక్షేత్రమై భారతదేశమునుండి యేగాక యావత్ప్రపంచమునుండియు వచ్చు జ్ఞానార్థులకు జ్ఞాన, విజ్ఞాననిలయమై తనరారుచుండెను. ఇచ్చట సమస్త శాస్త్రములు, కళలు సుచితముగ బోధింపబడుచుండెడివి. పాండవులీచోటు నుండియే యరణ్యములకు తరలి వెడలినట్లు లాక్షాగృహ దహనమిచ్చటనే జరిగినట్లు చెప్పుదురు. బ్రిటిషు వారు రెండువందల యేండ్లు నానా కుట్రలుపన్ని నిర్మించిన 'భారత బానిస లాక్షాగృహము' నకిచ్చటనే మొదట దహన సంస్కారము ప్రారంభింపబడెను.

అది యిట్లుజరిగెను. 1916 సంవత్సరములో వైస్రాయి హార్డింజి ప్రభువు హిందూ విశ్వవిద్యాలయమునకు పునాదులు వేయుటకు కాశికాపురి కేతెంచెను. ఈయుత్సవ మతివైభవ ముగ జరుపబడెను. భారతదేశములోని యనేకమంది సంస్థానాధిపతులానాటి సభకు హాజరైరి. మదనమోహనమాలవ్య పండితుడుగా గాంధీజీని యీ యుత్సవమున కాహ్వానించెను. గాంధీజీ కాశికాపురి కరుదెంచి యా క్షేత్రనాయకుడగు విశ్వేశ్వరుని యాలయమును దర్శించెను. కోట్లకొలది

భక్తులువచ్చు పుణ్యస్థలము. భారతీయులచే 'కాశీలో మరణించినచో ముక్తికలుగునని భావింపబడు ప్రదేశము, జ్ఞాననిలయమని ప్రఖ్యాతిగాంచిన విశ్వేశ్వరాలయము మురికికూపముగనుండుట కతడు ఖేదపడుచు నాటి సభకువచ్చెను. ఆనాటి సభకు దర్భాంగమహారాజు అధ్యక్షత వహించెను. అర్ధచంద్రాకారముగ నిర్మింపబడిన వేదికమీద మరికొంత మంది సంస్థానాధిపతులు 'శృంగారకాయ' లవలె నాసీనులై యుండిరి. పట్టు పాయిజామాలు, పట్టు అంగరకాలు, పాదాంగుష్టము మొదలు శిరస్సువరకు బంగరు తొడవులు, తొడుగుల ముత్యాలహారములు, కేయూరములు భుజకీర్తులు విలాసముగ నెగురుచుండు నెత్తితురాయిలు, వీటికితోడు నడ్డిపటకాలు, వాటికి వ్రేలగట్టబడిన బంగరుపిడులుగల కరవాలములు ధరించిన యీ సంస్థానాధిపతుల దృశ్యమును గాంధీజీ చూచెను. రాజాధిరాజులు, ఉన్నతప్రభుత్వాధికారులు, సర్, నైట్, జి. సి. ఐ యిత్యాది బిరుదులు, కితాబుదారులుగల యీ సభలో రాజభక్తి తాండవమాడు చుండెను.

ఈ కాశీ యుదంత మానాడే యువభారత హృదయ ఫలకములమీద రాబోవు నిరుపమాన విప్లవబీజములను నాటెను. ఆ నాటి సభలోనుండుభాగ్య మీ గ్రంధకర్తకు లభించెను. 1908 నుండియు గాంధీజీ నామమును దక్షిణా

ఫ్రికా సమరచరిత్రద్వారా కర్ణపేయముగ వినుచుండిన యీ గ్రంథకర్త 1916లో త్రివేణి సంగమస్థానమైన ప్రయాగలో కాలేజి విద్యార్థిగ నుండి మహాత్ముని దర్శించుటకే నాటి సభకు కాశికాపురి వెళ్ళెను.

అనిబిసెంటు సతి యుపన్యాసము ముగిసిన తరువాత మహాత్ముని వంతువచ్చెను. అతను వేదికచేరగనే దిశలు పిక్కటిల్లునట్లు ప్రజలు మహాత్మాగాంధికిజై యను హర్ష ధ్వానములను చేసిరి. అతడొకసారి సభనంతను కలయ జూడగా పైనవర్ణింపబడిన విచిత్రరాజలోక మతనిదృష్టి నాకర్షించెను. వెంటనే యతడీవికృతరూపధారులు స్త్రీలా పురుషులాయని ప్రశ్నించెను. రాజభక్తి తాండమాడుచున్న యీ వేదికమీద రాజాధిరాజు లాసీనులై యున్న యీ నిండు సభలో నంత నిర్మొగమాటముగ, నిర్భయముగ నొక బడుగు దేహమువాడు మాట్లాడుట భారతచరిత్రలో నూత నాధ్యాయము. అతడీ ప్రశ్న వేసినపుడా సభ యంతయు నివ్వెరపడెను. ఆ సభలో నతడా మహారాజులకిట్లుపదేశిం చెను. "అయ్యా మీరు మీ మీ సంస్థానములకు దయచేసి మీ నగలనమ్మివేసి యా ధనమును బీదలకు పంచివేయుడు. మీరు మీ మీ ధర్మములను నెరవేర్పుడు. మీరు మీ యాస్తులకు ధర్మకర్తలు. మీ ప్రజలపట్ల మీరు న్యాయముగ వర్తింపలేని మీ సంస్థానములు బర్తరఫు చేయ

బడును.'' అశనిపాతములవంటి యీ నిశితవాక్యములను వినుటతోడనే సంస్థానాధిపతులందరు చకితాంత రంగులై వెలవెల బారు ముఖములతో నొకరినొకరు చూచుకొన నారంభించిరి.

అట్లు వారి కుదొబ్బిధించిన తరువాత మహాత్ముని దృష్టి బ్రిటిషు ప్రభుత్వదుర్నీతిపై పడెను. ఆనాడు పట్టణములో నెచ్చటజూచినను రక్షకభటులు కాపలా కాయుచుండిరి. పట్టణమంతయు ముట్టడింపబడెనా యన్నట్లుండెను. రాజ మార్గములోని యిండ్లన్నియు సైనికబందోబస్తు చేయ బడెను. నాడు ప్రజావ్యాపారమంతయు బందుచేయుబడెను. మార్గములందు నడచుట, రోగులకొరకు వైద్యులను రప్పించు కొనుట దుర్ఘటముగ నుండెను. ఈయట్టహాసమంతయు రాజ ప్రతినిధియైన హార్డింజిప్రభువు రక్షణకొరకేయని మహాత్ము నకు నివేదింపబడెను. ఒక వ్యక్తికొరకింతటి ప్రజావ రోధము, భయముకలుగచేయు టతనికసహ్యముగతోచెను. 'ఒక వ్యక్తిని రక్షించుట కసహాయులైన ప్రజల నీవిధముగ భయభ్రాంతులనుచేసి జీవించియు చనిపోవుటకంటె హార్డింజి ప్రభువుకు సహజమరణమే మేలు.' అని యతడు ప్రారం భించి 'బ్రిటిషు వారీ దేశమునుండి మూటముల్లె చంకబెట్టి తరలిపోవలసిన సమయ మాసన్నమైనది. ఉపన్యాసములతో ప్రొద్దుబుచ్చుకాల మంతరించినది, మనము మన కాలుసేతు లను ఝాడించి కర్మరంగమున కురుకువలసియున్నది.'

అను నపూర్వవాగ్జాలముతో సభదద్దరిలు నట్లురుముచుండ నెచ్చటివా రచ్చట చేష్టలుదక్కి చిత్తరుబొమ్మలవలెనుండిరి. దర్భాంగ మహారాజు గజగజ లాడుచుండెను. అనిబిసెంటు సతి బాబు భగవాన్ దాసు చెవిలో నేదియో రహస్యముగా రాల్చెను. సభలో కలకలము బయలుదేరెను సభాసదు లుద్రిక్తులై మహాత్ముని యుపన్యాసమును సాగింపనుని కోరుచుండిరి. అధ్యక్షు లేమిచేయుటకు తోచక మాలవ్య పండితుని, దగ్గరగానున్న మరికొంతమందిని సంప్రదించి యతని యుపన్యాసమును సాగింపవలసినదనియే కోరెను.

మహాత్ముడు ద్విగుణీకృతోత్సాహముతో బ్రిటిషు ప్రభుత్వ తత్త్వము నతితీవ్రముగ విమర్శించుచుండెను. ఇంతలో అనిబిసెంటు సతి (నాటిసభకు బాధ్యతవహించిన వారిలో నొక ముఖ్యపాత్ర వహించిన యాంగ్లవనిత) కలుగజేసికొని 'గాంధీరాజకీయ శిశువు, అతడు రాజద్రోహమును పురిగొల్పుచున్నాడు. అతడు తన యుపన్యాసములోని కొన్ని యంశముల నుపసంహరించుకొనవలెనని కోరుచున్నాను.' అని యనెను. 'నేను ప్రతియక్షరమును చివరకు కామా, సెమికోలను, చుక్కబొట్టు తూచియే వేసితిని. నేనుపసంహరించు కొనవలసిన దిసుమంతయు లేదు.' అని మహాత్ముడనుచు తన యుపన్యాసముచు సాగించుచుండ సంస్థానాధిపతు లొకరొకరే సభనుండి మెల్లగాజారిపోవుచుండిరి. వారి వెనుక నధికారగణము, వారి పిరుందున బిరుముల

వారు పిక్కబలముచూపింప సాగిరి. సభయంతయు గంధర గోళముగనుండెను. ఉపన్యాసము సాగింపవలసినదని వేల కొలదిగనున్న ప్రజానీకము ప్రతిధ్వనించుచుండెను. మహా త్ముడు తన స్థానమునువీడక నుద్దేకమెంతమాత్రము చెందక బ్రిటిషుప్రభుత్వ గౌరవమును డొల్లచేయుచుండెను. ఇంతలో సభాధ్యక్షుడే సభవిడిచి లేచిపోయెను. అంతటితో సభ సమాప్తమైనట్లు తలంపబడెను.

'ఇదేమివింత ! నేనేమిమాట్లాడితిని ? నేనన్నృతములు పలుకలేదే! ఉపన్యాసముతో విసుగుచెంది సభలనుండి సభ్యులు లేచిపోవుటను నేను చూచితిని. అసంబద్ధముగను డొంకతిరుగుడుగను మాట్లాడుచుండుటచే వక్తలను కూర్చుండబెట్టిన సభలను నేను చూచితిని. కాని నేటిరోజు వరకు తన సభనే విడిచి యధ్యక్షుడే లేచిపోవుట నెన్నడు చూచియుండలేదు.' అని మహాత్ముడు ప్రక్కనున్న వారితో ననుచుండగా నాటి సభకు బాధ్యత వహించిన వారిలో నొకరగు శ్రీ శ్రీ ప్రకాశ్ గారు వినిరట.

ఈ యుదంతమంతయు నలుబదియెనిమిది వత్సరముల క్రితము 'రవి యస్తమింపని బ్రిటిషుసామ్రాజ్యము' అఖండ ముగ వెలుగొందుచు ప్రపంచ రాజకీయములను నడిపించు చున్న రోజులలో జరిగినదను విషయము మరువరాదు.

ఈ కాశీ యుదంతము తరువాత 1947 అగష్టు 15వ తేదీ వరకు జరిగిన భారత చరిత్ర యీ వుపన్యాస చారిత్ర కావతరణమేయనియు, నీ ముప్పది యొక్క వత్సరములు

మహాత్ముడు భారత రాజకీయరంగము ననన్యముగ నడిపించె ననియు నతని యాధిపత్యము బలుబదికోట్ల ప్రజల హృదయ సీమల మీద నలిపిన ప్రేమరాజ్యమనియు, భారతమునే కాక ప్రపంచము నంతను నాక్రమించిన యిరువదియవ శతాబ్దపు యింద్రజాలమనియు, బుద్ధిహీంసులను, సామ్రాజ్యములను తల్లడ పరచిన యతీంద్రియ వ్యాపారమనియు మున్ముందు మనకవగతము కాగలదు.

అనిబిసెంటు సతి 'గాంధీరాజకీయ శిశువు' అని యా రాజసభలో ముట్టనాడిన విషయమును మన మీది వరకే విని యుంటిమి. ఆమెయే మరి కొంత కాలము గతించిన తరువాత తన న్యూయిండియా పత్రికలో మహాత్ముని గురించి మూడు మాటలలో (రామాయణము నొకరు వర్ణించినట్లు) 'అతడు వచ్చెను; చూచెను; జయించెను' అని వ్రాసెను.

1893లో దక్షిణాఫ్రికా వెడలినమహాత్ముడు ముయ్యేడు వత్సరములా విచిత్రఖండములో నుండి 1915లో స్వదేశము తిరిగి వచ్చి 1916లో కాశీకాపురిలో శంఖారావము పూరించి నిద్రాతివశమై యున్న ప్రజాళిని మేల్కొలిపి యిరువదియారు వత్సరములు వివిధ సత్యాగ్రహ రంగములు నడిపి 1942లో భారత దేశమును వీడుడు-స్వదేశంగచ్ఛ మీ దేశముపొందు-అని బ్రిటిషు ప్రభుత్వముపై నపరకర్మ మంత్రమును పఠించి వైదేశీయులు నిండక మునుపే 1947లో స్వాతంత్ర్యమును రప్పించిన గాథ యికముందు వినగలము.

# 1916వ సంవత్సరము

భారత కాంగ్రెస్ చరిత్రలోను ప్రపంచ చరిత్రలోను కూడ 1916 కొంత ప్రసిద్ధికెక్కిన సంవత్సరము. 1907 సూరత్ కాంగ్రెసులో రెండు పక్షము లేర్పడెను. అతి వాదులు కాంగ్రెసును విడిచి వెళ్ళిపోయిరి. వారు 1916లో లక్ష్మణపుర కాంగ్రెసులో తిలక్, కపర్ది, లజపతిరాయి, అనిబిసెంటు, సురేంద్రనాథబెనర్జీల నాయకత్వము క్రింద కాంగ్రెసును వశపరచు కొనిరి. ఈ కాంగ్రెసులోనే హిందూ ముసల్మాను సమాఖ్య పూర్ణస్వరూపము దాల్చినది. కాంగ్రెసు ముస్లింలీగు ప్రణాళిక పూర్తి చేయబడి నేడు అదృష్టము (Luck-now) పట్టినది యను సంతోషమీ కాంగ్రెసులో ప్రకటింపబడెను.

ఈ కాంగ్రెసులో మరియొక చిత్ర సంఘటన జరిగెను. అధ్యక్షుడు అంబికాచరణము జందారు తన యుపన్యాసము నాంగ్లములో వనర్గళ గంగాప్రవాహ రంహస్సుతో నడిపించి శ్రోతల నానంద పరచెను. మహాత్ముడు కూడా నీ సభకు వచ్చెను. అతని యుపన్యాసమును వినవలెనని ప్రజలు కుతూహల పడుచుండిరి. అతడు లేచి 'ప్యారీ భాయో బహానో'యని యప్పటి కాంగ్రెసు భాషమైన ఇంగ్లీషులో కాక హిందీభాషలో సంబోధించుచు మాట్లాడ నారంభించెను.

సభ్యులందరు 'ఇంగ్లీషు, ఇంగ్లీషు' అని కేకలు వేసిరి. అతడు కొంత సేపటి వరకు హిందీలోనే మాట్లాడి, కొలది కాలము లోనే హిందీ రాష్ట్ర భాష కానున్నది.

స్వరాజ్యము రావలెనని కాంక్షించువారు కాంగ్రెసులో యింగ్లీషు మాట్లాడుట యనుచితము. దాక్షిణాత్య సోదరులందరు హిందీ నేర్చుకొనవలెనని నేను హెచ్చరించు చున్నాను.' అని యతడు నిర్మొగమాటముగ నుడివెను. ఇది పిడుగువంటిమాట. కాంగ్రెసు చరిత్రలో క్రొత్త విషయము. అతడప్పుడే కాంగ్రెసుకు వరవడి ప్రారంభించెను. తరువాత హిందీరాష్ట్ర భాషగా నంగీకరింపబడెను.

అనిబిసెంటుసతి నామము నిదివరకే మనము వినియుం టిమి. ఈమె యాంగ్లవనిత. మహాశక్తిసంపన్నురాలు. వక్తృత్వములో ప్రపంచప్రఖ్యాతిగన్నస్త్రీ. ఈమె ప్రపంచ మందంతట దివ్యజ్ఞానసమాజములను స్థాపించి నిరంతరము దివ్యజ్ఞానసమాజ సాహిత్యమును వ్రాయుచు ఖండాంతర భాషలలోనికి తర్జుమా చేయించుచు ననుపమానసేవచేసిన మహావ్యక్తి. ఈమె ప్రత్యేకము భారతదేశమునకు చేసినసేవ కూడ యపారమైనది. భారతస్వాతంత్ర్య పోరాటమును గురించి యీమె యనేక పుస్తకములను వ్రాసెను. భగవద్గీ తను లోకమంతట విరివిగా ప్రచారము చేయించెను. కాంగ్రెసు నడక మందముగ నున్నదని యీమె 1916 లో హోంరూలు సంఘము నొకదానిని స్థాపించెను. దేశమంతట

ననేక శాఖలు స్థాపింపబడి దీని ప్రణాళిక ప్రచారము గావింప బడుచుండెను.

ఈమె సభలకు వేలకొలది విద్యార్థులు వచ్చుచుండెడి వారు. పెంట్లండు ప్రభువు. విద్యార్థులు రాజకీయములలో పాల్గొనరాదని 556 నెం జి. ఓ. వ్రాసుచేసెను. దీనితో మరింత యల్లరి బయలు దేరెను న్యూ ఇండియా. కామ న్వీల్ అను నామె పత్రికలకు ప్రభుత్వము వారు 20,000 ధరావతు పుచ్చుకొని చివరకా ధనము తమ వశము చేసి కొనిరి. ఆమె ప్రచారము తీవ్రతరమగుచున్నదను నెపమున నామెమీద నామె యనుయాయులైన వాడియా, అరండే లులమీద నిర్బంధ ప్రవాస శిక్ష విధించిరి. ఇది పెద్దయాం దోళనకు కారణమై సాత్త్విక నిరోధమునకు ప్రయత్నములు జరుగుచుండగా నామెను వదలివేసిరి. 1917 కాంగ్రెసుకు ఆమె యధ్యక్షురాలు. ఈ కాంగ్రెసులోనే యాంధ్ర రాష్ట్రము ప్రత్యేక కాంగ్రెసు రాష్ట్రముగ నంగీకరింప బడెను. ఈ కాంగ్రెసు సభలయట్టహాసముల చాటున నొక యపూర్వ సంఘటన జరిగెను. మహాత్ముడీ కాంగ్రెసుకువచ్చు చున్నాడని తెలిసి, రాజకుమార శుక్లయను నొక చాంప రాను రైతు కాంగ్రెసుకు వచ్చెను. ఇతడొక బక్కచిక్కిన పేదరైతు. ఆ రోజులలో నితని గోడువినువారెవరు! మహా త్ముని చాంపరాను రావలసినదని యచ్చటి ప్రజలకష్టములను తిలకించవలసినదని యితడు పట్టుబట్టెను. అది యక్కడకు

వందలకొలది మైళ్ల దూరములో నుండెను. శుక్ల భల్లూకపు పట్టుపట్టి మహాత్ముని విడిచిపెట్టక నతడు వెళ్లినచోటులకెల్ల వెళ్ళుచు నక్షత్రకునివలె వెంటబడుచుండెను. 1917 లో మహాత్ముడు కలకత్తా వెళ్ళగా శుక్ల యచ్చట ప్రత్యక్షమయ్యెను. అచ్చట నుండియైనను చాంపరాను రావలసినదని యతడు మహాత్ముని బలవంతపెట్టెను.

ఈ చాంపరాను జనకచక్రవర్తి భూమి. చ్చట విశేషముగ మామిడి తోపులుండెను అట్లే నీలిమందుతోటలు కూడ విస్తారముగ నుండెడివి. ఇచ్చటి రైతు తనపొలములో విధిగా చట్టము ప్రకారము సుమారు యేడవవంతు (ఇరువదింట మూడుపాళ్ళు) నీలిమందు పండించి తనయజమానికీయవలెను. ఈ చాంపరాను యెచ్చట నున్నది, నీలిమందు చెట్టో పుట్టో, అది యెట్లు తయారగునో, దాని వలన యెన్నివేలమంది బాధ పడుచున్నారో మహాత్మున కపుడు తెలియదు. 'వకీలుబాబు మీకు మా కష్టములన్నిటిని సవిస్తరముగ చెప్పగలడు' అని శుక్ల మహాత్మున కొక యాల్పాకా కోటుధరించిన బాబును చూపించెను. మహాత్ముడు శుక్ల బాధ పడలేక చాంపరాను వెళ్ళుట కంగీకరించెను.

# 1917 చాంపరాను

కలకత్తానుండి మహాత్ముడు శుక్లతో చాంపరాను బయలుదేరెను. వీరిద్దరు మోటరైతులవలెనుండిరి, 'నేను రైతును, నేతనేయువాడను' అని 1922లో మహాత్ముడు తనను శిక్షించిన జడ్జికి వ్రాతమూలకముగ తన వృత్తినిగురించి తెలియచేసెను. లక్నో కాంగ్రెసుకు వెళ్ళుచు అలహాబాదులో దిగిననాడు మోతీలాల్, మాలవ్యాజీ, డాక్టరు సుందరలాల్ ప్రభృతులు మహాత్ముని కొరకు స్టేషనుకు వెళ్ళి యున్నిపెట్టెలు వెతికి యతడు రాలేదని నిరాశ చెందుచుండ నొక మూడవక్లాసు పెట్టెలోనుండి పలాకు లాంటి యైదడుగుల చిల్లర పొడవుగల చామనచాయవ్యక్తి, ముతకధోవతి, గుడ్డబొత్తాములుగల కుడితిని చుట్టిచుట్టల రైతు తలపాగగల రూపములో దిగగా 'నడుగో గాంధీజీ' యని మిన్నంటునట్లు ప్రజలుపెట్టిన కేకలు యీ సమయమున జ్ఞప్తికిరాకతప్పదు. ఈ యిద్దరు రైతులు బయలు దేరి కలకత్తానుండి పాట్నా, ముజఫరుపురము వెళ్ళిరి. ఈ రాజకుమారశుక్ల యమాయకుడు. ఏమియు తెలియనివాడు. కనుక మహాత్ముడే తనకార్యక్రమమును నిర్ణయించుచుండెను. ముజఫరుపురములో వజ్రకిషోరు, గయాబాబు, రాజేంద్రబాబు, ఆచార్యకృపలానీ, మాల్కానీ రామనవమీ ప్రసాదు మొదలగు పెద్దపెద్ద వకీళ్ళతోను, ఆచార్యులతోను నతనికిపరిచయము కలిగెను,

వ్రజకిషోరు బాబు నీలిమందు చరిత్రనంతను పూసగ్రుచ్చి నట్లతనికి వివరించి చెప్పెను. మహాత్మునకు సమస్తము అర్థమయ్యెను. 'ఈ విషయము కొండేండ్లుపట్టును. కానినాకు మీ సహాయము కావలెను.' అని యతను వారందరి తోను చెప్పెను. వెంటనే వారందరు నతను కోరిన సహాయమంతయు చేసెదమని వాగ్దానము చేసిరి. వేలకొలది రైతులను కలుసుకొని వారి కష్టసుఖములను తెలిసికొనుటయే యతని ప్రథమోద్దేశ్యము. కాని నీలిమందు తోటల యజమానులు చెప్పువిషయములను కూడ తెలుసుకొనుట యతని విధి. అతడు వెంటనే వారి కార్యదర్శిని కలుసుకొనగా 'నీవు పైనుండి వచ్చినవాడవు. నీవు మాకు మాకౌలుదార్లకు మధ్యవచ్చుటకు మేమంగీకరించు వారముకాము' అని దుంజు కొనుచు చెప్పివేసెను తాను పైనుండి వచ్చిన యెవడో కాడని, రైతులకోర్కెల మీద విషయములను తెలిసికొనుటకతనికి హక్కు కలదని, యతనికి మర్యాదగానే చెప్పి జిల్లాకమిషనరుతో మాట్లాడెను. ఈ కమీషనరు మహాత్మునితో నతివిరసముగా కఠ్రపడి వాటముగా మాట్లాడి యతనిని టిర్హాట్ విడిచిపోవలసినదని యాజ్ఞాపించెను.

దీనితో చాంపరానుకథకృతిమించి రాగమునపడెను. మహాత్ముడు తన యనుచరుల కీవిషయములను తెల్పి రాబోవుసత్యాగ్రహసంగ్రామమునకు సన్నద్ధమగుచుండెను. అతడు మోతీహార్ ప్రాంతములకు పోవుచుండగా చాంప

రాను విడిచిపోవలెనను నోటీసు అందచేయబడెను. అతడా యాజ్ఞల నుల్లంఘించెను. ఈవార్త దవానలమువలె నంటుకొనెను. మోతీహార్ యొక్కసారిగా తీర్థరాజమై ప్రజల నాకర్షించెను. ఇది నేపాల్ సమీపమువనున్న హిమవత్ప్రాంతము. తక్కిన హిందూదేశముతో సంబంధములేనిది. వీరికెవరికి కాంగ్రెసుసంగతి తెలియునే తెలియదు. తెలిసెనో యదివకీళ్ల గుంపుకు సంబంధించిన వాగ్యుద్ధసభయని తెలియును. కనుక ప్రజలతోగాని మరెవ్వరితోగాని కాంగ్రెసు ప్రమేయమెత్తకుండగనే కార్యవాదమును పురస్కరించుకొని మహాత్ముడు తానే ముందుకురికెను. వెంటనే ప్రభుత్వము వారతనిమీద యాంక్షతొలగించి యతనిని ముందుకు పోనిచ్చిరి.

చాంపరాను రైతునుగురించిన సముజాయిషీ ప్రారంభమయ్యెను. వేలకొలది రైతులు గుంపులు గుంపులుగ వచ్చుచుండిరి. వీరివద్ద వాఙ్మాలములు తీసికొనవలెను. సాక్షులను క్రాసుపరీక్షచేయుట, అనవసరసాక్ష్యములను నిరాకరించుట, మహాత్ముని సందర్శింప వచ్చినవారిని తృప్తిపరచి పంపుట. ఉపన్యాసకులు, వ్రాయసగాండ్రు, లెక్కలను తయారుచేయువారు, బసలు, భోజనములు యేర్పాటు చేయువారు, వచ్చినవారిని వెంటనే పంపువారు, అదుపాజ్ఞలలో నుంచువారు-ఇట్లు చాంపరాను మోతీహారీలు రైతుక్షేత్రయాత్రలతో, రాజకీయచైతన్యముతో నిర్భయత్వ

ముతో, నపూర్వసంచలనముతో నిండియుండెను, తోట యజమానుల యెదుట, సి. ఐ. డి యుద్యోగుల సమక్షమున సాక్ష్యములు తీసికొనబడుచుండెను. ఈ పద్ధతివలన భయము తొలగిపోయెను. గోరంతలు కొండంతలు చేయక యథార్థము చెప్పుటకూడ యలవడెను.

దీనికంతకు ధనమవసరము. బొంబాయి, కలకత్తా, బర్మా మొదలగుచోట్లనుండి కనకవర్షము కురిపింతుమను తంతులు మహాత్మునకు పంపబడెను. కాని మహాత్ముడు దీనికై పైవారి నుండిడబ్బుతీసికొన నిరాకరించెను. బీహారులోని కొద్దిమంది సహాయముతోనే దీనిని జయప్రదము కావింపవచ్చునని యతని విశ్వాసము.

అతనికిది యొక పెద్దసమస్యగా తోచలేదు. కాని బీహారులో శాశ్వతమైనపని జరుగవలెననిన గ్రామగ్రామము లోను ప్రచారముకావలెను. అక్కడ చదువు బొత్తిగాలేదు. ప్రజలు చాలబీదవారు. ఉచితముగ చదువుచెప్పువా రతనకికావలసివచ్చెను. అట్టివారిని రమ్మని యుతడు కోరగానే బొంబాయి, పూనా, శబర్మతీలనుండి బాబుసాహేబు సోమన్, పుండరీక్, శ్రీపతి అవంతికాబాయిగోక్లే, ఆనంద బాయి, దేవదాసుగాంధి, కస్తూరీబాయి, మహాదేవ దేశాయి, నరహరిఫరీక్, అతని సతీమణి మొదలగు త్యాగ ధనులెందరో వచ్చిరి. బీహారులో నేలయీనినట్లయ్యెను. ప్రజలలో చైతన్యము ముప్పిరిగొనెను. ఒకవంక సాంఘిక

ప్రచారము, విద్యాప్రచారము, రైతుసాహాయ్యములు, నీతి బోధలు జరుగుచుండ ప్రభుత్వమువారే యొక కమిటీని నియమింతుమని మహాత్ముని యందులో సభ్యుడుగ నుండవలెనని కోరిరి. దీనికి మహాత్ముడంగీకరించెను.

సర్ ఫ్రాంకుస్లై యీ కమిటీ యధ్యక్షుడు. నీలిమందు తోటయజమానుల కెంతయో పలుకుబడికలదు. వారు తమ బలమునంతను వినియోగించిరి. అనేకోపాయములనుపన్నిరి. చివరకు కమిటీవారేకగ్రీవముగ నొకే యభిప్రాయమునకు వచ్చిరి. నూరువత్సరములనుండి యమలులోనున్న తింకే తియాపద్ధతికి, తోటయజమానుల రాజ్యమునకు స్వస్తి చెప్పబడెను. ఈ భూఖామందులు తెల్లవారు. రైతులు కేవలము కౌలుదార్లు. వీరికి 64 రకముల పన్నులుండెడివి. మహాత్ముని కృషిఫలితముగ రైతులదే న్యాయమని రుజువుచేయబడెను. నాటితో నీలిమందు దుర్మార్గము రూపుమాసెను. చాంపరాను రైతు బానిసత్వము తొలగిపోయెను.

# 1917 ఖేడా

1917లో బీహారులో మహాత్ముని నాయకత్వముక్రింద నమాయక రైతులోకమః 'రవియస్తమింపని బ్రిటిషుసామ్రాజ్యము' నెదిర్చి యొక్కగుండు పేల్చకుండ తమదాస్యమును పోగొట్టుకొనుచుండ రష్యాలో నదేసమయమున నొక గొప్ప రక్తవిప్లవము బయలు దేరెను. రక్తము యథేచ్ఛగా ప్రవహింప చేయబడెను. రాజకుటుంబములన్నియు బలి గొనబడెను. సైనికులు, సామాన్య ప్రజలు తిరుగబడిరి. చివరకు లెనెను నాయకత్వము క్రింద 'కమ్యూనిజము' అను నూతన రాజ్యతంత్ర మేర్పడెను. ఈ తంత్రములో రక్తపాతము, నిప్పు, ఉక్కు, తుపాకి, బాంబుప్రయోగము, దోపిడీలతో కూడిన మారణక్రియాకలాపము, బహిరంగముగ నాట్యమాడెను. నేటికిని ప్రపంచములోని రాజ్యము లిట్టి విధానమునే యనుసరించుచున్నవి.

1917 లోను మహాత్ముడు భారత రాజకీయ రంగములో నడుగిడినదాది యతని నాయకత్వముక్రింద బయలుదేరిన విప్లవమింకొక తరహాకు చెందినది. ఈ రెంటి మధ్య నక్కకు దేవలోకమునకు గలంత యంతరమున్నది. ఇచ్చట మహాత్ముని నాయకత్వముకింద 'బిటిషు సింహపు జూలును ఝాడించిన' విప్లవమే బయలు దేరెను. బ్రిటిషు సింహము

తనపంజాను అనగా నుక్క, బాంబు, విమానము, కత్తి, లాఠి యురికంబము మొదలగు వానిని యధేచ్ఛగా నుపయోగించెను.

కాని రెండవ ప్రక్క నొకబడుగు దేహమువాడు, బీతావహులు, దారిద్ర్య మూర్ణితులు, శక్తిహీనులు, అజ్ఞానపూర్ణులు, మోసరహితులు, బక్కప్రేగులు గలవారి ధర్మసైన్యము-దీనితోనే చాంపరాను రైతుల నూరేండ్లనాటి దాస్యము చికెలమీద పోగొట్టుకొనగలిగిరి. రష్యావిప్లవము, కమ్యూనిజము, పుట్టకమునుపే 1916లోనే కాశీలో మహాత్ముడు బ్రిటిషు ప్రభుత్వముమీద సంస్థానాధిపతుల మీద నురిమిన యురుములు మన చెవులలో గంగురు మనుచునే యున్నవికదా! 1914లో ప్రారంభింపబడిన మొదటి ప్రపంచ యుద్ధమింకను సాగుచునే యుండెను. కోట్లకొలది ధనము యేరులకొలది రక్తము ప్రవహింపచేయబడెను. కాని విజయమింకను నెవరికిని చేకూరలేదు. ఇంతలో 1917వచ్చెను. భారతదేశములో కలకలము బయలుదేరెను. హోమ్‌రూలు ఉద్యమముతోపాటు భారతదేశమున కధినివేశప్రతిపత్తి (Dominion Status) ప్రసాదింపవలసినదని కాంగ్రెసు ముస్లింలీగు కూడ ప్రభుత్వమునకు విజ్ఞప్తులు పంపించెను. అలీసోదరులను విడుదల చేయవలెనని యాందోళన సాగుచుండెను. చాంపరాను పోరాటము విజయవంతమయ్యెను. ఈ సమయములోనే భారతకార్యదర్శి మాంటీగ్ యీ దేశ

మంతయు పర్యటించి 'మాంటేగ్ ప్రణాళిక' నొకదానిని తయారు చేసెను. ఇతడు భారతరాజ్యాంగచట్టము 'కొయ్యవలెనున్నదని, అదియెంతమాత్రము ప్రళయమునకుపూర్వాము దని పెరుగుటలేదని' యుద్ధానంతరమేదియో యొరగ పెట్టబడుననీ చెప్పెను. చాలమంది మాంటేగ్చు పెల్మ్సు ఫర్డు ప్రణాళికచేత మోహితులైరి. మితవాదు లీపాటనే పాడనారంభించిరి. ఇది నాటి కాంగ్రెసు తరహాకుచెందిన వారి మనస్తత్వము.

ఒక వంక చాంపరాను రంగము పూర్తియగుచుండ అహమ్మదాబాదులో కూలీసమస్య బయలుదేరెను. యుద్ధ సమయములో వస్తువులధరలన్నియు పెరిగిపోయెను. యంత్ర యజమానులకు ముఖ్యముగా బట్టలయంత్రయజమానుల కపారలాభములు చేకూరెను. కూలీల జీతములు మాత్రము హెచ్చింపబడలేదు. అంబాలాల్, సారాబాయి మిల్లుయజమానుల తరపున అతని సోదరి అనసూయాబాయి కూలీల తరపున పోరుచుండిరి. ఉభయులు మధ్యవర్తిపరిష్కారమున కంగీకరించుట మంచిదని మహాత్ముడు సూచించెను. కాని వారందుల కంగీకరింపలేదు.

దౌర్జన్యములు చేయక, పనిలోనికిపోవు వారిని బాధింపక యాచనపై నాధారపడక, సమ్మెకాలములో నితర కృషిచే జీవించుపద్ధతిని సమ్మెచేయవలసినదని మహాత్ముడు కూలీలకు

సలహా చెప్పెను. కూలీనాయకులతని షరతుల కంగీకరించిరి. వారందరు సభ చేసికొని తమ షరతుల నంగీకరించువరకు లేదా మధ్యవర్తి పరిష్కారము కంగీకరించువరకు సమ్మె చేయుటకు తీర్మానించుకొనిరి. వల్లభాయి పటేలు, శంకరలాల్ బ్యాంకరులతో మహాత్మున కీసమయమందే యెక్కువ పరిచయము కలిగెను. వేలకొలది కూలీలు శబర్మతీ తీరమున నొక తరుచ్ఛాయ క్రింద నిత్యము హాజరగుచుండిరి. వారు చేసిన ప్రతిజ్ఞను గురించి మహాత్ముడు వారికి నిత్యము హెచ్చరించుచునే యుండెను. ఇట్లు మూడు వారములు గడిచెను. సమ్మెదారులు నిగ్రహమును, ధైర్యస్థైర్యములను చూపిరి. కాని మిల్లుయజమానులు బలవంతులు. వారు లొంగుబాటుకు రాలేదు. సమ్మెదారులలో కొందరు పనికి పోవనారంభించిరి. తక్కినవారు వారిని నిర్బంధింపనారంభించిరి. ఒడంబడిక కుదురువరకు నన్నముముట్టనని మహాత్ముడు శపథము చేసెను. దానితో కూలీలు కలవరపడిరి. వారు తమ తప్పొప్పుకొనిరి. అతడు మూడురోజులుపవాసము చేయుటతోడనే మిల్లుయజమానులు కూడ దిగివచ్చిరి. ఉభయులమధ్య సమాధానము కుదిరెను.

ఇంతలో ఖేడా యుద్ధాయము ప్రారంభమయ్యెను. ఖేడాజిల్లాలో వర్షములు లేక పంటలు చెడిపోయెను. కరువు తాండవ మాడుచుండెను. ఆ సంవత్సరమునకు పన్ను వసూలు

చేయుట నిలుపు చేయవలసినదని ఖేడా పట్టాదారులు కోరిరి. ప్రజలు కోరుట ఆంగ్ల ప్రభుత్వమంగీకరించుట యనునది బ్రిటిషు ప్రభుత్వ చరిత్రలో నింతవరకు జరుగలేదు. అమృతలాల్ ఠక్కరు కమిషనరుతో సంప్రదించెను. గవర్నరు వద్దకు రాయబారములు పంపబడెను. భూమిపన్ను వసూలు నిబంధనల ప్రకారము వ్యవసాయదారు లావత్సరము పన్ను పూర్తిగా రద్దుచేయుమనియే కోరవచ్చును. ఆయేడు పావలా పంట కూడ పండలేదు. కాని బ్రిటిషు అధికారులు దీనికంగీకరించువారు కారు. వారు మధ్యవర్తి పరిష్కారము కూడ పనికి రాదనిరి. చివరకు సత్యాగ్రహము చేయ వలసినదని మహాత్ముడు వారికి సలహా ఇచ్చెను.

వల్లభాయి పటేలు, శంకరలాల్ బ్యాంకరు, అనసూయాబాయి, ఇందులాల్ యాజ్ఞిక్, మహాదేవ దేశాయి మొదలగు వారు మహాత్మునితో పనిచేసిరి. నడియాదు లోని యనాధ శరణాలయము కేంద్రస్థానముగ చేయబడెను. ఖేడా వార్తలెప్పటికప్పుడు ప్రకటింపబడుచుండెను. గుజరాతు వారు ధనము కురిపించుటకు కుతూహల పడుచుండిరి. కాని సత్యాగ్రహమునకు ధనమంత ముఖ్యము కాదని మహాత్ముని నిర్ణయము. రైతుల కధికారుల యెడల భయము పోవలెను. అధికారులు ప్రజాసేవకే యున్నారని గుర్తింపవలెను ప్రజలు తమ మర్యాదను పోగొట్టుకొనరాదు. సత్యాగ్రహమున కంతరంగబలము, సత్యము శత్రువును కూడా మిత్రునిగా

త్రిప్పుకొనగల మంచితనము అవసరము. ఇట్టి ప్రచారమే గ్రామ గ్రామమున జరుపబడెను.

ఈ ప్రచార మీస్థాయిలో నుండగ నధికార ధూర్వహుల చర్యలు విపరీతముగ నుండెను. వారు చరాస్తుల నమ్మివేయుచు, పంటలు వేలమువేయుచు, పశువులను జప్తుచేయుచు విచ్చల విడిగ సంచరించుచుండిరి. దీని వలన ప్రజలలో నపూర్వ సంచలనము కలిగెను వారి భయము తొలగిపోయెను. దుర్బలహృదయులు కొంత మంది కాతర భావము చూపినను దీనియంతు చూడవలెనని తో ప్రజలు తీర్మానించుకొనిరి. శంకరలాల్ ఫరిక్ రైతులు పన్ను చెల్లించిరి. అతని కీవిషయము తెలియుటతోడనే పన్నుకట్టబడిన భూమి నతడు ప్రజా కార్యములకై దానముచేసివేసెను.

ఒకరి పొలములోని యుల్లిపైరు అక్రమముగ జప్తుచేయబడెను. కనుక దానిని యూడబెరుకమని మహాత్ముడు రైతులకు సలహా చెప్పెను. మోహన్లాల్ పాండ్యా చలాకీయైనవాడు. అతడు సత్యాగ్రహములో కొన్ని మచ్చుపనులు చేయుట కుత్సహించుచు వెంటనే యాయుల్లి చేనులో ప్రవేశించెను. అతనితో మరియెనిమిదిమంది దానిలో దిగికిరి. ప్రభుత్వము వారీ యవినయమును భరింపజాలరైరి. వెంటనే వారి నందరిని జైలులో నుంచిరి. దీనితో ప్రజల కోలాహలము మిన్నంటెను. వారి విచారణరోజున కోర్టు ప్రజలతో కిటకిటలాడుచుండెను. వారికందరకు స్వల్పశిక్షలు విధింపగా

'ఉల్లిదొంగలు, ఉల్లిదొంగలు' అను నినాదములతో ప్రజలు వారి నూరేగింపులతో జయిలుకుసాగనంపిరి.

ఇట్లుండగ నడియాదు మమ్లతుదారు (తాహసీల్ దారు) డబ్బుకల పట్టాదారులు పన్నులు కట్టివేసినచో బీదవారి విషయమై పన్నువసూలు నిలుపుచేయబడునని మహాత్మునకు కబురుచేసెను. ప్రజలు ప్రారంభమునుండియు దీనినే కోరుచుండిరి. ఈ విషయము కలెక్టరుతో ప్రస్తావింపగా తానప్పుడే యాజ్ఞలను జారీ చేసినట్లతడు చెప్పెను. ప్రభుత్వ ప్రకటనలో సౌష్టవము, సత్యాగ్రహ విజయముపట్ల తగిన యుదారత చూపబడక పోయినను ప్రజల దృష్ట్యా యీ యుద్యమ మమూల్యమైనది. గుజరాతు అంతయు దీనితో మేల్కొనెను. రైతులలో ప్రజాసామాన్యములో నూతన చైతన్యము, రాజకీయవిజ్ఞత సాంఘికమైకమత్యము కార్యోత్సాహము వెల్లివిరియుచుండెను.

అన్నిటికంటె నీ యుద్యమములో వల్లభాయిపటేలు బారిష్టరు పట్టావిడిచిపెట్టి ప్రజారంగములోనికి వచ్చుటయే ఘన విజయము. అది గుజరాతుకేగాక యావద్భారతమునకు మహాదృష్టము. ఈ విషయమే గుజరాతువరదలలోనూ, బార్డోలీ సత్యాగ్రహములోనూ, భారత స్వాతంత్ర్య సంగ్రామములోనూ, స్వతంత్ర భారతరాజ్యతంత్ర నిర్వాహణదక్షత లోనూ ముందు ముందు విదితముకాగలదు. ఈ ఖేడా

యుద్యమముద్వారా గుజరాతులో సత్యాగ్రహము వేరులు నాటుకొనెను.

మొదటి ప్రపంచయుద్ధమింకను ముగియలేదు. మిత్రమండలి కతి విషమస్థితి యేర్పడెను. జర్మనీ యంచెల మీద దేశములను జయించుచు యింగ్లండుమీద కురుకుచుండెను. ఒకటితరువాత నొకటిగ దేశములు జర్మనీ కాహుతి యగుచుండెను. ఫ్రాన్సుజర్మనుల ధాటి కాగలేక కీచు కీచు మనుచుండెను. పారిసునగరమునకు పదునారుమైళ్ల వరకు జర్మను సైన్యములు పొంగివచ్చెను. ఇట్టి సమయములో వైస్రాయి సైనికభిక్ష పెట్టవలసినదని భిక్షాపాత్ర చేబూని నాయకులందరను వేడుకొనెను. ఢిల్లీలోనొక సభ జరుపబడెను. ఢిల్లీ యేడు సామ్రాజ్యములకు సమాధికట్టిన స్థానము. ఈ సభకు నాయకులందరు వచ్చిరి. మహాత్ముడుకూడ నాటిసభకు హాజరయ్యెను. ఆ సభలో నతడు హిందీలోనే మాట్లాడెను. ఇట్టి సభలలో హిందీలో మాట్లాడగలుగుట కతనికే చెల్లెనని, యదే మొదటిసారి యని యనేకమంది మహాత్ముని శ్లాఘించిరి. 'నా బాధ్యతను పూర్తిగా గుర్తెరిగియే నేనీ తీర్మానమును చేయుచున్నాను' అని యతడు చెప్పెను. సైన్యములో నున్నతోద్యోగములను భారతీయులకిచ్చు వాగ్దానము ప్రభుత్వమువారు ముందుగా చేయుచో వేలకొలది సైనికులను జేర్పించెదనని యీ వాగ్దానము నెరవేరువరకూ 50,000 రూపాయిలు ధరా

వతు కట్టెదనని చెప్పుచు లోకమాన్యతిలకు మహాత్మునివేర నొక చెక్కు పంపించెను. కాని మహాత్మునకు షరతులతో పనిలేదు. అతడా షరతు కంగీకరింపక చెక్కు తిప్పివేసెను. కాని ముస్లిముల కోర్కెలనుగురించియు, ప్రజల కనీస రాజకీయవాంఛితములను గురించియు తెలుపుచు అనిబిసెంటు సతిని, లోకమాన్యుని, ఆలీసోదరులను పిలువనందులకు తన విచారమును తెలుపుచు మహాత్ముడు రాజప్రతినిధికొక లేఖవ్రాసి దానిని కేంబ్రిడ్జి మతశాఖకు చెందిన యెర్లండు అను నొక మతగురువుద్వారా పంపించెను.

మహాత్ముని చేతిలో రాజకీయములెట్లు మారిపోవుచున్నవో, యతడు వాటి నేస్థాయిలో నడుపుచుండెనో గమనింపదగిన విషయము. అతని యాశయము లెంతపవిత్రములైనవో యంత పవిత్రములైన విధానములనే యతడు చేపట్టెను. అతని విధానములు మన రాజకీయరంగములోనేగాక ప్రపంచ రాజకీయరంగములో కూడా నతిక్రొత్తవి. వింతయైనవి. "తెలివిగల వారమనుకొనువారిచే తిరస్కరింపబడినవి. వేళాకోళము చేయబడినవి. బ్రిటిషుప్రభుత్వమువారిచే 'పిచ్చిచేష్టలుగ' పరిగణింపబడినవి. కాని యివియే భారత ప్రజాహృదయమును మాత్ర మాకర్షించిన" వని చెప్పకతప్పదు. దక్షిణాఫ్రికానుండి తిరిగివచ్చి బొంబాయిలో నడుగిడినది మొదలు గాంధీజీ చేపట్టిన ప్రతిచిన్న పనిలోనూ పెద్దపనిలోనూ నతని విశిష్టత, యుపజ్ఞ, కళా

విజ్ఞత, దక్షత కాన్పించుచునే యుండెను. అతడింకను కాంగ్రెసులో ప్రవేశింపలేదు. అతనికి దానితో నెట్టి సంబంధము లేదు. అతడింతవరకు నడుపవచ్చిన ప్రతియుద్యమమును తన స్వంత బాధ్యతమీదనే నడుపుచుండెను. కాని నలుబదికోట్ల భారతీయుల దృష్టి యిప్పుడే యతనిపై నిగిడింపబడుచుండె ననుటకు సందేహము లేదు.

వైస్రాయికా యుత్తరమును పంపి యతడు సైనికులను జేర్పించు యత్నములో నిమగ్నుడయ్యెను. ఈ ప్రచారములో నతని యారోగ్యము కొంత చెడెను. అనారోగ్యముగ నుండియు నతడు పనిచేయుచుండుటచే నతనిని యాశ్రమమునకు జేర్చవలసివచ్చెను. అతడీస్థితిలోనుండగా జర్మనీ పూర్తిగా యోడిపోయినట్లు, సైనికులను జేర్పించు నవసరము లేనట్లు కమిషనరు కబురుచేసినట్లు వల్లభాయిపటేలు అతనితో చెప్పెను ఈ వార్త యతనికి కొంత విశ్రాంతి నిచ్చెను. అతడు మథెరానుకు మారినచో నారోగ్యము బాగుపడునని వైద్యులు సలహాచెప్పిరి. కాని యచ్చటి నీరతనికి పడలేదు. చివరకు డాక్టరు దలాల్ వైద్యసహాయము వలన నతని కారోగ్యము చేకూరెను.

# రౌలటు చట్టము

1914 లో ప్రపంచయుద్ధము ప్రారంభమయ్యెను. ప్రారంభములోనే జర్మనీ యాధిక్యమతి తీవ్రముగ నుండెను. భారతదేశమునుండి బ్రిటిషువారి కపార జన ధన సహాయము కావలెను. దీనికెట్టి యడ్డంకి లేకుండ జరుగవలెను. ప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వము కావలెనని, హోమ్‌రూలు కావలెనని కేకలు వేయుచుండిరి. వీటి నరికట్టుటకు 'భారతసంరక్షణచట్టము' అనునొక చట్టము యుద్ధసమయములో ప్రవేశపెట్టిరి. దీనిప్రకార మెవరినైన నొక పని చేయమని నిర్బంధింపవచ్చును; లేదా చేయకూడదని శాశింపవచ్చును. అనుమానింపబడినవారిని కాలపరిమితి లేకుండ నిర్బంధింపవచ్చును. బిపినచంద్రపాలు, బాలగంగాధర తిలకులను ఢిల్లీ, పాంచాలము పోరాదని శాసించిరి. మౌలానా అబ్దుల్ కలాంఆజాద్, మహమ్మదాలీ, షౌకతాలీ సోదరులను నిర్బంధములోనుంచిరి. యుద్ధముకొరకు సైనికులను ధనమును ప్రోగుచేయుట కవలంబించిన పద్ధతులవలన ప్రజలలో నుద్రేకము రేకెత్తెను. పంజాబులోను తదితర ప్రాంతములలోనూ ప్రజలనుండి బలవంతముగ యుద్ధఋణములను గుంజుచుండిరి. అధికారుల బలవంతము మితిమీరెను. ముద్రణాశాసనము తీవ్రరూపము దాల్చెను. వంగరాష్ట్రమున 3000 మంది యువకులు నిర్బంధింపబడిరి.

అనిబిసెంటుసతిని బొంబాయి పోరాదని నిషేధించిరి. ఇది చాలక రౌలటు అనువాని యధ్యక్షతక్రింద నొక కమిటీ వేసిరి. ఈ కమిటీ యొకనివేదికను తయారుచేసెను. ఇది సామ్రాజ్య శాసనసభలో చర్చకువచ్చెను. భారతదేశ మంతయు నొక్కుమ్మడిగ దీనిని తిరస్కరించెను. ఇది చట్టమగుచో ప్రజల ప్రధానహక్కులకే భంగమువాటిల్లునని తీర్మానింపబడెను. ఈకమిటీ నివేదిక మహాత్ముని యాశ్చర్య చకితుని చేసెను. శంకర్లాల్ బ్యాంకరు, ఉమర్ సోభానీ మొదలగు పెద్దలు మహాత్ముని దర్శించి దీని విషమపరిణామ మును గురించి మాట్లాడి యతనిని తగుచర్య తీసికొనవలసిన దని కోరిరి. 'ఈ పరిస్థితులలో మనమేమిచేయగలము?' అని వల్లభాయి యతనిని ప్రశ్నించెను. 'ఏదో యొకటి చేయుకతప్పదు' అని యతడు బదులుచెప్పెను.

చివరకు మహాత్ముని యాశ్రమములో నొక సభ జరుప బడెను. వల్లభాయి, శ్రీమతి సరోజినీదేవి, హార్నిమన్, సోభాని, శంకరలాల్ బ్యాంకర్, శ్రీమతి అనుసూయాబేగ్ మొదలగువా రిరువదిమంది చేరిరి. సత్యాగ్రహశపథ మొకటి తయారు చేయబడెను. అచ్చటి వారందరు దానిమీద సంతకములుచేసిరి. సత్యాగ్రహ మొక నూతనాస్త్రము. దీని నింతవరకు నే సంస్థయు నవలంబింపలేదు. కనుక మహా త్ముని సలహాప్రకారము 'సత్యాగ్రహసభ' స్థాపింప బడెను. దీనిలో చేరిన సభ్యులు చాలమంది బొంబాయి

వారు. కనుక దీనికి బొంబాయి కేంద్రమయ్యెను. క్రమముగ వేలకొలది ప్రజలు దీనిలో సభ్యులైరి. మహాత్ముడే దీని కధ్యక్షుడయ్యెను.

రౌలటు బిల్లులమీద నిట్లొకవంక ప్రజాకార్యక్రమము సాగుచుండ భారత శాసనసభలో దీనిని ప్రవేశపెట్టుటకు ప్రయత్నములు జరుగుచుండెను. అతిమితవాదియైన గోఖ్లే శిష్యుడైన శ్రీనివాసశాస్త్రిగారు తన యనర్గళధోరణిలో మాట్లాడుచు దీనిని తీవ్రముగ నెదిరించెను. రాజప్రతినిధి యతని యుపన్యాసమును నిశ్చేష్టుడై వినుచుండెను. నిద్రపోవువానిని లేపవచ్చును. కాని దొంగ నిద్రపోవువాని నెవరు లేపగలరు? ఈ యుపన్యాసమునకు ప్రభుత్వ మెంతమాత్రము చలింపక యీ బిల్లు నామోదించెను.

శ్రీనివాసశాస్త్రిగారి యుపన్యాసము పట్టివ్వలేదు. అంతటితో మహాత్ముడూరకొనక రాజప్రతినిధికి వ్యక్తిగతముగను, బహిరంగముగను కొన్ని యుత్తరములను వ్రాసి సత్యాగ్రహముచేయుట తప్ప తనకు వేరొక మార్గములేదనికూడ స్పష్టపరచెను. ఈ బిల్లులింకను గెజెటులో ప్రకటింపబడకమునుపే మద్రాసునుండి కస్తూరి రంగయ్యంగారు (హిందూ పత్రికాధిపతి) మహాత్మునకొక యాహ్వానమంపెను. అతనికింకను ఆరోగ్యము పూర్తిగా చేకూరలేదు. దుర్బలముగనుండుటచే నతడు సభలలో కూర్చొనియే మాట్లాడుచుండెను. ఇచ్చటనే మహాత్మునకు మొదటిసారి

చక్రవర్తి రాజగోపాలాచారిగారితో పరిచయము కలిగెను. ఈయన సేలములో న్యాయవాదిగనుండి కొద్దికాలముక్రింద టనే యచ్చటనుండి మద్రాసు న్యాయవాదివృత్తి నవలంబించుటకు వచ్చివేసెను. మహదేవదేశాయి యితని ప్రతిభను గ్రహించి మహాత్మునితో చెప్పెను. వారు నిత్యము కలుసుకొనుచూ రౌలటు బిల్లులు చట్టమగుచో చేయవలసిన కార్యక్రమమును గురించి చర్చించుకొనుచుండిరి.

ఈ విధముగ దినదినము చర్చలు జరుగుచుండ రౌలటు బిల్లులలో నొకటిచట్టమైనట్లు ప్రకటింపబడెను. ఆ చట్టమునుగురించి ధ్యానించుచు మహాత్ముడు నిద్రించెను. అతడు నిద్రనుండి లేచుటకు పూర్వ మొక కలగనెను. దేశమంతట హరతాళములు జరుపవలెననియు, సత్యాగ్రహము పవిత్ర సమరమనియు, దానికాత్మపవిత్రత ప్రధానమనియు, నుపవాసము, దైవప్రార్థనలు జరుగవలెననియు, దేశమంతట నన్నివ్యాపారములను కట్టిపెట్టవలెననియు, నీ కార్యక్రమమున కొకదినము నిర్ణయింపబడవలెననియు నతనికి తట్టెను. ఈ విషయము నతడందరకు బహిరంగపరచగా దీనికి సర్వజనామోదము లభించెను. రాజగోపాలాచారిగారు ముగ్ధులైరి.

వెంటనే 1919 ఏప్రిల్ 6 వ తేదీ హరతాళదినముగ ప్రకటింపబడెను. ఇదేమిరాజకీయము ? ఇదిరాజకీయమా, మతమా, దైవప్రార్థనయా, భజనపార్టీయా ? యని చాలమంది శంకించిరి కాని ఈ కేకసేతుసీతనగమధ్యస్థ దేశ

మంతయు మారుమ్రోగి జిల్లాలు, తాలూకాలు, పట్టణములు, పల్లెలు, కుగ్రామములు జేగంటలతోను, దైవప్రార్థనలతోను ప్రతిధ్వనించెను. ఆ నాడన్నిమతస్థుల వారా బాలగోపాలము నుపవసించిరి. పట్టణములలోను, పల్లెలలోను, దుకాణములన్నియు మూసివేయబడెను. దేశమంతట సమస్తవ్యాపారములు కట్టివేయబడెను. ప్రజలు వీధులలో గుమిగూడి రౌలటు బిల్లులను నిరసించుచు శాంతియుతమైన ప్రచారము, అసమ్మతి వెలిబుచ్చిరి. ఢిల్లీ, బొంబాయి, లాహోరు, అమృతసరు, కలకత్తా, మద్రాసు-ఈ యా పట్టణము, పల్లెయననేల ? నేల నాలుగుచెరగుల యుత్సవములు, ఉపన్యాసములు, ప్రార్థనలు, ఉపవాసములు, వ్యాపారము స్తంభించిపోయెను. ఇందులో ప్రభుత్వమేపనిని యాపుచేయగలదు ? ఎందుల కాపుచేయవలెను ? ఇదియొక క్రొత్తరకపు తిరుగుబాటు. కత్తితో నిమిత్తములేదు. కర్రతో పనిలేదు.

1857లో నొక స్వాతంత్ర్యపోరాటము జరిగి విఫలమైన విషయము మనమెరుగుదుము. తరువాత భారతదేశములో నచ్చటచ్చట స్థానికముగ సమస్యలుద్భవించుటయు నవియెట్లో పరిష్కారమగుచుండుటయు జరిగెను. అవి రాజకీయ సమస్యలుకావు. ఇది బ్రహ్మాండమైన రాజకీయ సమస్య; యావద్భారతదేశమునకు సంబంధించినది. ఇది యెన్నడు కనివిని యెరుగని చైతన్యము, ప్రభుత్వాధికారము,

స్వతంత్రవాంఛ. ఇది ప్రభుత్వము సహింప జాలని తిరుగుబాటు కనుక దీనిని మొదటలోనే త్రుంచివేయవలెనని ప్రభుత్వము సంకల్పించెను.

మొదట మార్చి 30వ తేది హరతాళదినముగ ప్రకటింపబడుటచే ఢిల్లిలో నాదినముననే జరుపబడెను. స్వామిశ్రద్ధానంద, హకీంఅజ్మల్‌ఖాన్‌ల యాజ్ఞ లానగరములో సుగ్రీవాజ్ఞగా భావింపబడును. హిందువులు మహమ్మదీయులు నేకమైపోయిరి. స్వామిశ్రద్ధానంద జుమ్మామసీదులో బ్రహ్మాండమైన సభలో మహమ్మదీయుల కుపన్యసించెను. ఢిల్లీయంతయు నాటియుత్సవములో పాల్గొనెను. ఉత్సవము జరుగుచుండ పోలీసు లభ్యంతరపరచి తుపాకులు పేల్చిరి. కొంతమంది వెంటనే చనిపోయిరి. చాలమందికి గాయములు తగిలెను. లాహోరు, అమృతసరులలో కూడ నిట్లే జరిగెను, ఆనాడు మహాత్ముడు బొంబాయిలోనుండెను. చౌపతీసముద్ర తీరము వద్ద ప్రజలు స్నానమాచరించి యుత్సవములతోను భజనలతోను బయలుదేరిరి. స్త్రీలు, బిడ్డలు, హిందువులు మహమ్మదీయులు వేనకువేలు వచ్చిరి. ఇదియొక తీర్థప్రజవలె నుండెను. హరతాళ మఖండవిజయవంతముగ జరిగెను.

శాసన నోల్లంఘున సన్నాహములు చేయబడెను. ప్రజలు సులభముగ నుల్లంఘింప దగు శాసనము లెవ్వియో పరిశోధింపబడెను. ఉప్పు పన్ను అతిదారుణమైనది. దానిని గురించి యదివరకే తీవ్రమైన యాందోళన కలదు. దానిని

రద్దుచేయించు టత్యవసరము. కనుక సముద్రజలము తెచ్చి యిండ్లలో ఉప్పు తయారుచేయవలెనను సూచనను మహాత్ముడు చేసెను. అతడు వ్రాసిన 'సర్వోదయ' 'హిందు స్వరాజ్య' యను రెండు పుస్తకములు నిషేధింపబడెను. కనుక నీ రెండు పుస్తకములను అచ్చువేయించి బహిరంగ ముగ విక్రయించుట కేర్పాట్లు గావింపబడెను. నాల్గణాలు విలువగల పుస్తకము యేబది రూపాయల వరకు నమ్ముడు పోయెను. అసలు ధరకు కొనబడిన పుస్తక మొక్కటియు లేదు. పుస్తకములమీద వచ్చులాభమంతయు శాసనోల్లంఘ నోద్యమమునకై వినియోగింపబడెను. పుస్తకములుకొన్న వారు జయిలుకు పంపబడుదురని విశదీకరింపబడెను. ప్రజ లన్ని కష్టములకు సిద్ధపడిరి.

ఈ రాజకీయ యాందోళనతో పాటు స్వదేశవ్రతము, హిందూముస్లిము యైకమత్య దీక్షపూనవలెనని మహాత్ముడు సూచించెను. ఇవి యంత తేలికయైనవి కావని యాందోళన చేయుటలో నున్నంత రుచి కార్యశూరత్వములోను, దీక్షను పాలించుటలోను ప్రజలకు లేదని మహాత్ముడు గ్రహించెను.

ఇంతలో పంజాబు రావలసినదని యతనికి తంతివార్తలు వచ్చెను. ఏప్రియల్ యేడవ తేదీ రాత్రి యతడు ఢిల్లీ యమృత సరములకు బయలుదేరెను. కాని యతడు మధురబృందావన ప్రాంతములకు వెళ్లుసరికి ముందుకు పోరాదను తాఖీదువచ్చెను. అతడు దానిని తిరస్కరించెను. మహాత్ముని బండి పాల్వాలు

రైలుస్టేషను చేరుటతోడనే పోలీసులతనిని దింపివేసిరి. మహాదేవదేశాయి యీ వార్త శ్రీద్ధానందస్వామి కందించెను. ప్రజలందరు శాంతముగ నుండవలెనని మహాత్ముడు సందేశము పంపెను. అతనిని కొంతదూరము సరకులబండిలోనూ, మూడవతరగతి బండిలోనూ, మొదటి తరగతి బండిలోనూ, యెక్కించి చివరకు బొంబాయిలో దింపివేసిరి.

బొంబాయి నగరము 'వందేమాతరం' అల్లాహో అక్బరు అను నినాదములతో నే మూలచూచినను మారు మ్రోగుచుండెను. ప్రజలు బ్రహ్మాండమైన యుత్సవములు జరుపుచుండిరి. గుఱ్ఱములపై నెక్కి సాయుధ పాణులైన పోలీసులు ప్రజలపై కురుకుచుండిరి. ఉద్రేకపూరితులైన ప్రజలు రాళ్ళు రువ్వుచుండిరి. ఒకరి మాట రొకరికి వినిపింపకుండెను. గుఱ్ఱపుడెక్కలు ప్రజలతలలమీద తాండవమాడు చుండెను. అనేకమందితలలు పగులు చుండుట చే ప్రజలు చిందరవందరయై పారిపోవుచుండిరి. ఈగందరగోళములో మహాత్ముని మాట లెవరికిని వినిపింపకుండెను. సాయంకాలము చౌపతీ తీరమున గొప్ప సభ జరిగెను. మహాత్ముడు దౌర్జన్య రాహిత్యతత్త్వమును గురించి, సత్యాగ్రహ మర్యాదలను గురించి హెచ్చరించుచు వాటిని త్రికరణ శుద్ధిగా నాచరించినగాని సమిష్టిసత్యాగ్రహము నడుపబడదని తెలిపెను. అహమ్మదాబాదులోకూడ నల్లరులు జరిగెను. అనసూయాబేనును నిర్బంధించి రను

వదంతులు బయలుదేరెను. ఈ వార్త విని కూలీ లుద్రేక పూరితులై దౌర్జన్యములు చేసిరి ఒక తెల్లపోలీసు సార్జెంటును చంపివేసిరి. వీరంగాములో మరియొక హత్యజరిగెను. నడియాడు రైల్వేస్టేషను వద్ద పట్టాలు పీకి వేయుటకు ప్రయత్నించిరి. ఈ యకృత్యములకు ప్రజలపై పగతీసి కొనబడెను. సైనిక శాసన మమలుజరుపబడెను. ప్రజలు భయవిహ్వలులగుచుండిరి. మహాత్ముడు వెంటనే యహమ్మదాబాదు చేరుకొని పోలీసు కమీషనరుతో మాట్లాడెను. 'దౌర్జన్యములు జరుగుట దురదృష్టమని, దానికతడెంతయు చింతించుచున్నాడనియు చెప్పి సైనిక శాసనమును రద్దు పరచవలసినదని' యాయధికారితో చెప్పెను. అతని వాద మాయధికారికి నచ్చెను. పదమూడవ తేదీని యతడు ప్రజలకుపన్యసించి వారితప్పులను విమర్శించి తప్పుచేసిన వారిని యొప్పుకొనమని సలహాచెప్పెను. దీనికై యతడు తనమీద మూడురోజు లుపవాసశిక్ష విధించుకొని ప్రజలను కూడ నొకదిన ముపవసింపగోరెను. ప్రజలను ఖండించినట్లే యతడు ప్రభుత్వమును కూడ ఖండించి తమతప్పుదిద్దుకొనవలసినదని చెప్పెను. ప్రజలు శాంతము నలవరచు కొనువరకు నతడు సత్యాగ్రహమును రద్దుచేసెదనని ప్రకటించెను.

అహమ్మదాబాదు సభయైన వెంటనే యతడు నడియాడు వెళ్లెను. అచ్చటి పరిస్థితులను చూడగనే యతడొక

సభలో తాను 'హిమాలయమంతటితప్పు' చేసినట్లు ప్రకటించెను. శాసనోల్లంఘనమునకు తగినశిక్ష నలవర్చుకొనినది లేనిది పరీక్షింపకుండ ఖేడా మొదలగుచోట్ల ప్రజలకనుజ్ఞ యిచ్చుట పొరపాటని యతడు గ్రహించెను. పవిత్ర హృదయులు, సుశిక్షితులు, సత్యాగ్రహనియమముల నర్థముచేసికొని యట్లు జీవింపగలవారుకలదళమును సృష్టింపవలెనని యతడు నిశ్చయించుకొనెను.

ఇట్టి భావములతో మహాత్ముడు బొంబాయివచ్చి సత్యాగ్రహసభద్వారా స్వచ్ఛంద శాంతిసైన్యమును సమకూర్చెను. వారి సహాయముతో నతడు ప్రజలకు సత్యాగ్రహతత్త్వము నుపదేశింప నారంభించి యనేక కరపత్రములను ప్రకటించెను. శాంతస్వభావము నలవరచుకొనుట చాలమందికి కష్టముగనే యుండెను. కొద్దిమందిమాత్రమే యీ పరీక్ష కాగుచుండిరి. కొత్తవారు చేరుటకు సందేహించుచుండిరి. ఇది యతడనుకొనినంత చురుకుగ సాగుటలేదని యతడు గ్రహించెను.

దక్షిణాఫ్రికాలో 'భారత యభిప్రాయము' అను పత్రిక ద్వారా సత్యాగ్రహ సాహిత్యము వెదజల్లబడెను. ఇప్పుడట్టి యవసరమే యిచ్చట నేర్పడెను. ముద్రణాలయముల మీద నిర్బంధశాసనములు చేయబడుచుండెను. బొంబాయి క్రానికలు పత్రికాధిపతి హార్నిమను నిర్బంధింపబడెను. స్వంత ముద్రణాలయమున్న కాని యిట్టి పనుల నెరవేరజాలవు.

'నవజీవన' 'యంగిండియా' యను రెండువారపత్రికలు స్థాపింపబడెను. మహాత్ముడీ పత్రికలద్వారా తన యమృత భావములను వర్షించుచు భారతప్రజాక్షేత్రమున సత్యాగ్రహబీజాంకురములను సుస్థిరముగ లిఖించుచుండెను.

మహాత్ముడు సత్యాగ్రహమును తాత్కాలికముగ నాపుచేసెను. అతడు పెద్ద పెద్ద పట్టణములకు స్వయముగ వెళ్లి యెట్టియల్లరులు జరుగకుండ చూచుచుండెను. అతడు పాంచాలమునకుగూడ పయనము కాగా ప్రభుత్వము వారతనిని బలవంతముగ వెనుకకు తీసుకొనివచ్చుట మనమిదివరకే వినియుంటిమి. ఇక పాంచాల పరాభవగాథ ముందు యధ్యాయములో వినగలము.

# పాంచాల పరాభవము

భారత యుద్ధమునకు పాంచాలీ పరాభవమే ప్రాతిపదిక. 1919 లో బ్రిటిషుప్రభుత్వము జరిపిన ఘోరపాంచాల, పాంచాలీల పరాభవఫలితమే 1920 మొదలు 1947 వరకు సాగిన యపూర్వ సత్యాగ్రహ సమరకాండ.

రౌలటు బిల్లులను తిరస్కరించుటకు దేశమందెల్లెడలను జరిగినట్లే పంజాబులో కూడ సభలుజరిగెను. పంజాబు వీరులే పారిసునగరమునకు పదునారుమైళ్ళ వరకువచ్చిన జర్మను సైనికులను 1916 లో నిలువరించిరి. వారి పరాక్రమమునకు, ప్రాణరక్షణమునకు మెచ్చి పారిసువనితలు వారిని వేనోళ్ల యాశీర్వదించిరి. జర్మనీ, ఆస్ట్రియా, రష్యా, టర్కీ, ఫ్రాన్సు యిత్యాది యుద్ధరంగములలో తెల్లవారి ప్రతిభనుడిల్లపోవు నట్లుచేసిన వీరులెందరో యప్పుడే స్వదేశము తిరిగివచ్చిరి. ఇట్టిపరిస్థితులలో 1919 లో కాంగ్రెసును పాంచాలమున కాహ్వానించిరి. మహాత్ముని శంఖారావము భారతసింహ ద్వారమైన యీ ప్రాంతమున మారుమూలలకూడ వినిపించు చుండెను. రౌలటుబిల్లులను తిరస్కరించుసభలు నిత్యము జరుగుచుండెను. ఇవన్నియు నచ్చట నిరంకుశప్రభువుగ నున్న సర్ మైకేల్ ఓడ్వాయరుకు బహుసంకటముగనుండెను. డాక్టరు కిచులు, సత్యపాల్ గార్లు కాంగ్రెసును జరిపించు

రత్నములో నిమగ్నులై యుండిరి. దానిని జరుగకుండ జేయవలెనని ఓడ్వాయరు ప్రతినబూనెను. అతడు ఏప్రిల్ 0 వ తేదీని వారినిపిలిపించి యెవరికిని తెలియనిప్రదేశమునకు ంపించి నిర్బంధములో నుంచెను. ఈ వార్త యమృతసరము లోను, లాహోరులోను వెంటనే దవానలమువలె విస్తరించెను. అప్పుడే వివిధయుద్ధరంగములనుండి తిరిగివచ్చిన వీరు లీసవాలు ందుకొని తమ నాయకులనేమిచేసిరో చెప్పవలసినదని జిల్లా మేజిస్ట్రేటు నడుగుటకు దండు వెడలిరి. జనప్రవాహమంత ంతకు హెచ్చిపోవుచుండెను. వీరినాపివేయుటకు సాయుధ పోలీసులువచ్చిరి. వారు కాలిమార్గములను వంతెనలను ముందుగనే కాపలాకాసి ప్రజలు రాళ్లురువ్విరని నెపము నూపి తుపాకులు బారుచేసిరి. వెంటనే కొందరు మరణిం చిరి. అనేకమంది క్షతగాత్రులైరి. ఆ శవముల నూరే ంచుచు ప్రజలుత్సవముగ బయలుదేరిరి. వారిలో నంత ంత కుద్రేకము ప్రబలెను. త్రోవలోనున్న నేషనల్ బ్యాంకును తగులబెట్టిరి. అయిదారుగురు తెల్లదొరలు హత్యచేయబడిరి. కొన్ని ప్రభుత్వభవనములు తగులబెట్ట బడెను. నాయకుల విషయమింకను ప్రజలకు తెలియలేదు. ప్రజలకావార్త తెలిపినచో నింత యుద్రేకముండదు. మహా త్ముని పంజాబుపోనిచ్చినను యీ దౌర్జన్యములు జరుగకుండె డివి. బొంబాయి, అహమ్మదాబాదులలో నతని రాకవలన దౌర్జన్యము లాగిపోయెను.

గుజరనువాలా, కసూరు గ్రామములలో కూడా నిట్లే జరిగెను. అనేకభవనములు, ఆఫీసులు తగులపెట్టబడెను. కొంత మంది తెల్లసిపాయిలను కొట్టిరి. ఈ దుండగముల పేరిట సైనిక శాసనములు చేయుబడెను. పదియవ తేదీ మొదలు అది యములులో నున్నను పదమూడవ తేదీ వరకు దానిని ప్రకటింపలేదని ప్రభుత్వనివేదికను బట్టియే రూఢియైనది. ఏప్రిల్ పదమూడు హిందూ సంవత్సరాది పండుగ. ఆ నాడు జలియనువాలాబాగ్‌లో గొప్పబహిరంగసభ జరిగెను. ఇది యమృతసరనగర మధ్యభాగమున నున్న యొకవిశాల మైదానము. దీనిచుట్టు యెత్తైనగోడలు కలవు. గోడలకవతల యిండ్లుకలవు. ఈ తోట కొకటే త్రోవకలదు. అది యిరుకు సీసామూతివలెనుండి యొకబండి పోవుటకైనను వీలులేక యుండెను. ఆ సంవత్సరాదిపండుగ నాడచట యిరువదివేల మంది స్త్రీ పురుషులు, వృద్ధులు, పసిపిల్లలు, బాలెంతలు సమావేశమైరి. లాలాహంసరాజు వేదికపై నుపన్యసించు చుండెను. డయ్యారు సేనాని యేబదిమంది బిటిషు సైనికులతోనూ, నూరుమంది భారతసైనికులతోనూ తోటలో ప్రవేశించి వెంటనే ప్రజలపై కాల్చవలసినదని యాజ్ఞాపించెను. ప్రజల కీవిషయమే తెలియదు. కూర్చున్న వారు కూర్చునట్లే కాల్చివేయుబడిరి, 1900 గుండ్లు పేల్చబడినట్లు మందుగుండు సామాను అంతయు ఖర్చగువరకు పేల్చుచుండినట్లు డయ్యరుహంటరు కమిటీ యెదుట సాక్ష్యమిచ్చెను. ఇరు

పది వేలమందికి రెండు మూడు నిముషములు మాత్రమేవ్యవధి యీయబడెనట. వెనుకనుండి తెల్లసైనికులు భారతసైనికుల చేకాల్పించిరి ఫిరంగులకారు తోటలోనికిపోవుటకు వీలులేక పోవుటచే బయటనే విడిచి పెట్టవలసి వచ్చెనని డయ్యరు సేనాని వాపోయెను. ఆనాడు నాలుగువందలమంది మరణించినట్లు రెండువేలవరకు గాయపడినట్లు ప్రభుత్వమే యొప్పుకొనెను ఆ రాత్రి యా శవములచటనే యుండెను. దెబ్బలు తిన్నవారికి, దాహాతురులైనవారికి, గాయపడినవారికి నెవరును సాయపడరాదట గుక్కెడు నీళ్లైనను యివ్వరాదట ఆ రాత్రి ప్రజల హాహాకారవములకు, పిల్లల యేడ్పులకు, భార్యల విలాపములకు, తండ్రుల కడుపుచిచ్చుకు, తల్లుల విలాపములకు నంతు లేక యుండెను. ఆ నాడమృతసరము శ్మశానభూమి గావింపబడెను. నిరాయుధులపైన, పసిపిల్లలపైన జేతాత్తుగ యుద్ధము ప్రకటింపబడుటేచరిత్రయందు కానింపదు.

ఈ భీభత్సకాండ యింతటితో ముగియలేదు. ఇటుపైన జరిగిన కిరాతకకృత్యములు మరింతఘోరాతి ఘోరములు. పట్టణములో నీటిసరఫరా ఆపివేయబడెను. విద్యుద్దీపములు తీసివేయబడెను. ముక్కోణములపై నిలిపి ప్రజలను కొరడాలతో కొట్టుటతిసామాన్యమయ్యెను. ప్రజలను భూమిమీద పొట్టలతో ప్రాకమనుట మరొక నీచాతినీచమైన కృత్యము. రోడ్డుప్రక్కల నిద్దరకుమించి నడువరాదనిరి. ప్రయాణీకు

లకు మూడవతరగతి టిక్కెట్లు నీయరాదనిరి. భారతీయుల సైకిళ్లన్నియు సైనికులకొరకు వశపరచుకొనబడినవి. వర్తకులచేత బలవంతముగ నంగళ్లను తెరపించిరి. సైనికాధికారులే వస్తువుల ధరలను నిర్ణయించిరి సైనికప్రభుత్వము బళ్లను స్వాధీనపరచుకొనెను. కోటగుమ్మమువద్ద కొరడాలతోను, వేపబెత్తములతోను కొట్టుటకొరకు బహిరంగమంటప మేర్పరచిరి. సైనిక న్యాయస్థానములవారి చేతనే కేసులన్నియు విచారింపబడుచుండెను. మామూలు నియమములు, న్యాయశాస్త్రము వీరిచే పాటింపబడలేదు. వీరు శిక్షించిన 218 మందిలోను 51 మందికి మరణశిక్షయు 46 మందికి యావజీవ ద్వీపాంతరవాసము, యిద్దరకు పదేశివత్సరములు, 79 మంది కేడేసివత్సరములు – ఈ విధముగ కఠినశిక్షలు విధింపబడెను.

సంవత్సరమువరకే వార్తలు బయట ప్రపంచమునకు తెలియనే తెలియవు. రాకపోకలన్నియు నిలిపివేయబడెను. పత్రికలు వార్తలను స్వేచ్ఛగ ప్రకటింపరాదు.

1919 జూలై నెలలో కలకత్తాలో అఖిలభారతకాంగ్రెసు సంఘుసమావేశము జరిగెను. అప్పటికి పంజాబువార్తలు కొద్దికొద్దిగవచ్చుచున్నను నతిరహస్యముగ నూపిరిబిగబెట్టుకొనియే సభ్యులు గుసగుసలాడుకొనుచుండెడివారు. పంజాబు మీాద కప్పబడిన యినుపతెర యింకను తొలగింపబడలేదు. ఒక్క యమృతసరమునందే కాక లాహోరు గుజరన్వాలా,

కసూరు మొదలగు ప్రాంతములలో కలనల్ జాన్సన్, బాస్వర్తుస్మిత్తు, కలనల్ ఓబ్రియన్ మొదలగు సివిల్ మిలటరీ యుద్యోగులు గావించిన యమానుషకృత్యము లకు రాళ్లుకూడ శోకించెనని చెప్పు టతిశయోక్తి కాదు. 'అతనికంటె ఘనుడు ఆచంటమల్లన్న' యనునట్లు వీరొక రినిమించి యొకరు అమృతసరు, లాహోరు సైనికశాసనముల నమలుపరచినట్లు పార్లమెంటుకు పంపబడిన 'వైటుపేపరు' వలననే విదితమగుచుండెను. అచ్చట కర్ఫ్యూ వుత్తరువులు నిమిషములమీద నాచరణలో పెట్టిరి. రాత్రి యెనిమిది గంటలుదాటి బయటకు వచ్చువారిని కాల్చిచంపివేయ వచ్చును. ముక్కోణములమీద కొరడాలతో మోద వచ్చును. ఖయిదు, జరిమానా విధింపవచ్చును. అంగళ్లను బలవంతముగ తెరపించవచ్చును. అట్లు తెరువనివారిని కొందరిని కాల్చివేసిరి. కొందరి యంగళ్లను బలవంతముగ తెరపించి యందులోని వస్తువుల నుచితముగ పంచిపెట్టిరి. ఇక లాయర్లు, యేజెంటులు, బొట్లు తమ పేరులను రిజిష్టరు చేయించుకొనవలెను. ఉత్తరువులు లేనిదే వారు నగరమును వీడిపోరాదు. గోడల కంటింపబడిన సైనిక శాసన ప్రకట నలను యజమానులు కాపాడవలెను. కళాశాలవిద్యార్థులు రోజుకు నాలుగుసార్లు సైనికాధికారులకు కన్పించవలెను.

బీదవారికొరకు కట్టబడిన ధర్మసత్రములు భోజన సత్రములు మూసివేయబడెను. అద్దెబండ్లవారు తమ బండ్లను సైనికాధికారులకు చూపించవలెను. హరతాళములో పాల్గొనిరని 300 టాంగాబండ్లు ప్రభుత్వవశము చేసికొనబడెను. ఒక వృద్ధును తన గోపురాకారము వేసికొనుచుండగా కర్ఫ్యూ ఉత్తరువు నుల్లంఘించెనని చావమోదిరి. విద్యావంతులకు మధ్యతరగతివారికి బుద్ధిచెప్పుటకే యీ యుత్తరువులను జారీ చేసినట్లు కలనల్ జాన్సను తన సాక్ష్యములో చెప్పెను. షాపుల్లవారు తమ గోడలకంటించిన కాగితములను స్వంతముగ చూచుకొనవలసివచ్చెను. ఏలనన నొక కాగితమును పోలీసు బంట్రోతు చింపివేయుచుండగ పట్టుకొనబడెను. పైగా రాత్రి యెనిమిదిగంటల తరువాత యజమానులే కాపలా కాయవలెను. కాని నౌకర్లు కాయకూడదనిరి. పదునారు యిరువదియేండ్ల మధ్యనున్న విద్యార్థులు సైనికాధికారుల దృష్టికి గురియైరి. భగ్గున మండువేసంగిలో లాహోరు వీధులలో విద్యార్థులు నాలుగేసిమైళ్లు నడచి సైనికాధికారుల వద్ద హాజరుకావలెను. వీరి నొకసారి పదహారుమైళ్లు నడిపించిరి. కొందరు మార్గమధ్యమున మూర్ఛపోయిరి. ఒక కళాశాల గోడలమీద నంటింపబడిన సైనికప్రకటనము చింపివేయబడినందులకు ప్రిన్సిపలుతో సహా యుపాధ్యాయులందరిని నిర్బంధములోనుంచిరి.

ఒక గ్రామ పెత్తందారును చెట్టుకుకట్టి సైనికాధికారులు కొరడాలతో కొట్టిరి. అది యాయనకు, గ్రామస్తులకు గుణ పాఠమట. కలనల్ ఓబ్రియను, కష్టనుడౌటను, జాస్వర్త స్మిత్తులుకూడా విదేశశక్తిలో సంచరించిరి. పై కాండనే వీరు కూడ యథాశక్తి జరిపించిరి 'గుంపు కన్పించినచోటనెల్ల కాల్చితిని' అని ఓబ్రియను హంటరు కమిటీయెదుట సాక్ష్య మిచ్చెను. డాడ్స్కిను పొలములోపని చేసికొను రైతుల మీద విమానమునుండి గుండ్లుబారుచేసెను. అశ్లేపెళ్లి వారి మీద, శ్మశానమునకు పోవువారిమీద పేల్చి యతడు తన పరాక్రమమును ప్రదర్శించెను. కర్బీయనునతడు దొమ్మీచేతు రని తానునుకొనిన వారిమీద బాంబులు వేసెను. గుంపును చెదరకొట్టుటకు, వారుపోయినతరువాత గ్రామమిమీదికే బారుచేసెను. అపరాధులను నిరపరాధులను తెలిసికొనుట యతనిపని కాదట. కొన్ని యిళ్ళు గుండ్లకుగురియైయుండవచ్చు నట. ప్రజోపయోగముకొరకే యీకాల్పులుజరిపెనట. కొంతమంది చనిపోయినతరువాత ప్రజలకుబుద్ధివచ్చి గుమి గూడరట. ఇట్టి 'మేళ్ళ' నేకము తనవలన జరిగెనని యతడు తనసాక్ష్యములో చెప్పెను.

ఇక కలనల్ ఓబ్రియను 'నల్లవాడు తెల్లదొరను కలుసు కొనినప్పుడు చేతులుజోడించి నమస్కరింపవలెను; బండి, మోటారు, గుఱ్ఱము, సైకిలు దేనిమీదనున్నను వెంటనే

దిగవలెను. గొడుగులను తక్షణమే ముడిచి వేయవలెను', అనియాజ్ఞాపించెనట. వీటినుల్లఘించిన వారిని కొరడాలతో కొట్టిరి. అనేకమందిని యరెస్టుచేసి యూరు వారములవరకు విచారణ లేకుండనుంచిరి. అనేకమందిని సరకులబండిలో కుక్కి లాహోరువరకు మందుటెండలో త్రిప్పిరి. కాలకృత్యములు తీర్చుకొనుటకు వీలులేదనిరి. 44గంటలు సరకుల బండిలో నిలువయుంచి బహిరంగ వీధులలో నడిపించునపుడు హిందువులకు మహమ్మదీయులకు లంకెవేసి హిందూమహమ్మదీయసమాఖ్యయని యవహేళన చేసిరి. లక్షరూపాయిలు సమర్పించి జార్జిరాజుపటశాలను స్థాపించి ప్రభుభక్తి ప్రకటించుకొనిన యొకవయోవృద్ధునకుగూడా యీ 'సంభావన' తప్పలేదు. తనకొడుకు లెచ్చటనున్నది చెప్పలేనందుల కొక రైతుయాస్తి స్వాధీనము చేసికొనబడెను.

కలనల్ ఓబ్రియను హయాములో సమ్మరీ కోర్టుల ద్వార 200 మంది శిక్షింపబడిరి. కొరడా దెబ్బలు, నెలమొదలు రెండువత్సరముల వరకు శిక్షలు విధింపబడెను. సైనిక న్యాయస్థానములో 149మంది శిక్షింపబడిరి. అందులో 22 మందికి మరణదండన 108 మందికి యావజ్జీవ ద్వీపాంతర వాసము తక్కినవారికి 10 వత్సరముల వరకు శిక్షలు యథాశక్తి వడ్డింపబడెను. మరునాడే సైనికశాసన మంతరించునని తెలిసి 24 గంటలలో దడదడా యనేక కేసూలుపెట్టి

ఓబ్రియను తన చేతిలోనుండి యొక్కడును తప్పించుకొనకుండ చూచెను.

చిన్నపిల్లలు యూనియన్ జాక్‌కు (తెల్లవారిపతాకమునకు) రోజుకు మూడుసారులు వందన మొనరింపవలెనని శాసింపబడెను. అక్షరాల తరగతిబాలురు కూడ పతాకవందనము చేయవలసినదే. మండువేసగి యెండలకు తాళజాలక వడ తగిలి కొందరుడింభకులు నేలకొరగి యసువులు బాసిరి. 'నేను నేరము చేయలేదు. ఇకముందు చేయను. నాకు బుద్ధి వచ్చినది, ముమ్మాటికి వచ్చినది' అని లెంపలు వాయించుకొనునట్లు చేసిన యుదాహరణము లెన్నియో కలవు. ఇది చేసిరదిచేసి రననేల? ఈ పనులను తమకే పశ్చాత్తాపము వచ్చు వరకుచేసి చివరకు సాంగ్లోయను చోట 'పశ్చాత్తాపమందిరము'ను నిర్మింపవలెనని హంటరుకమిటీ యెదుట భాస్వరుత్స్మిత్తు సూచించెను.

ఏప్రిల్ 14 వ తేదీని షెమ్సుఫర్డు ప్రభువొక నామమాత్రపు ప్రకటన గావించెను. ఇకముందెట్టి దౌష్ట్యములు గావింపబడవని యతడు ముక్తసరుగ చెప్పెను. ఈసమయమందే మూడవ ఆఫ్ఘను యుద్ధమువచ్చెను. దీనికొరకు మే నాల్గవ తేదీని సైన్యములు కేంద్రీకరింపబడెను. జూన్ 11 వరకు సైనిక శాసనము పొడిగింపబడెను. రైల్వేప్రాంతములలో మరికొంత కాలము సాగించిరి. ఈశాసనము వంతుపొంతు

లేకుండ పొడిగించినందులకు సర్ శంకరునాయరు వంటిబిరు దాంకితుడు రాజప్రతినిధి కార్యనిర్వాహక సభ్యత్వమునకు రాజీనామా చేసెను. భారత, పంజాబు దేశములకు సంబంధము లేకుండ వేరుచేయబడెను. అచ్చటివార్తలు పైకివచ్చుట లేదు. పైవారచ్చటకు పోకూడదు. సి. యఫ్. ఆండ్రూసు దీన బాంధవుడు. ఆంగ్లేయుడు. స్వతంత్రుడు. ఆయననే యచ్చట యడుగు పెట్టరాదనిరి. ఆయననొక రోజు రిమాండులోనుంచి వెనుకకు త్రిప్పివేసిరి. మే మొదటివారములో నతనిని అమృతసరములో నరెస్టుచేసిరి.

బారిష్టరు ఆర్డ్లీ నార్టను చాలగొప్పన్యాయవాది. అతడు కొందరు ముద్దాయిల తరపున వాదించుటకు పంజాబు పోవలసియుండెను. అతనినచ్చటకు పోరాదని శాసించిరి. సైనిక శాసన విచారణాధికారులు విధించిన భయంకర శిక్షలను తగ్గించవలసినదని ప్రజలుగగ్గోలుపెట్టిరి. సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకుడు, ఆర్థికవేత్త యగు లాలాహరికిషన్ లాల్‌కు యావజ్జీవ ద్వీపాంతరశిక్ష విధించి నలభైలక్షల రూపాయిల విలువగల యాస్తి ప్రభుత్వవశము చేసికొనిరి. పంజాబు అల్లరులను గురించి విచారించుటకు హంటరు కమిటీని నియమించి నట్లు వైస్రాయి ప్రకటించెను. కాని సెప్టెంబరు 18 వ తేదీని యధికారరక్షణ బిల్లు చర్చకు తెచ్చిరి. దానిని కొంతకాలము నిలిపి వేయవలెనని మాలవ్య పండితుడు గంభీరోపన్యాసము నిచ్చెను.

ఏప్రిల్ 20,21 తేదీలలో అ. భా. కాం. కమిటీ సభ జరిగెను. ఢిల్లీ, పాంచాలములకు మహాత్ముని పోరాదని ప్రభుత్వము జారిచేసిన నిషేధమును ప్రతిఘటించి పంజాబు దురంతములను గురించి విచారణ సలుపవలసినదని యొక తీర్మానము చేయబడెను. ఇచ్చట జరిగిన తీవ్రరాజకీయకల్లోలమును గురించి యింగ్లండులో ప్రచారము చేయుటకు విఠల్ భాయి పటేలు, యన్. సి. కేల్కరులు సీమకు పయనమైరి. ఏప్రిల్ 21వ తేదీని వైస్రాయి యొకఆర్డినెన్సు ప్రకటించి మార్చి 30 తరువాత జరిగిన నేరములను సైనిక న్యాయస్థానములవిచారణకు పంపవచ్చునని పంజాబుప్రభుత్వమున కధికారమిచ్చెను. ఆనాడే ఘోరతాళములు ప్రారంభమైనవి. కనుక ప్రభుత్వమిట్టి ఆర్డినెన్సుచేసెను. బొంబాయి క్రానికల్ పత్రికాధిపతి బి.జి హార్నిమన్ ప్రభుత్వ పద్ధతిని తీవ్రముగ నిరసించినందులకు ప్రవాసమునకు పంపబడెను.

పంజాబు దురంతములను విచారించుటకు, ఇంగ్లండు, యిండియాలలో న్యాయ చర్యలను తీసికొనుటకు, వీనికి తగు సొమ్ము వసూలుచేయుటకు అ. భా. కాం. సంఘము వారొక కమిటీ నియమించిరి. ఈకమిటిలో మహాత్మా, శ్రద్ధానంద, ఆండ్రూసుగార్లు చేర్చుకొనబడిరి. విచారణ పూర్తియగువరకు సైనికశాసన శిక్షల నమలుజరుపరాదని మాలవ్యా పండితుడు బ్రిటిషుప్రధానికి అ. భా. కాం. సంఘుపక్షమున తంతులను పం

పించెను. భారతరాజ్యాంగ కార్యదర్శికికూడ నిట్లే పంపించెను జూలై 20,21 తేదీలలో మరియొక అ. భా. కాం. సభజరిగెను. కాంగ్రెసును అమృతసరములో జరుపవలెనని, సరాసరి బ్రిటిషు ప్రభుత్వమే యొక కమిటీని నియమింపవలసినదని యిదితీర్మానించెను. సత్యాగ్రహమును విరమించినట్లు మహాత్ముడు మొట్టమొదటనే చెప్పెను. కాంగ్రెసు కమిటి తీర్మానాను సారము మోతీలాల్ నెహూౄ, మాలవ్య, శ్రద్ధానంద స్వామి జూన్ చివరవారములో పంజాబు వెళ్లిరి. సి.యఫ్ ఆండ్రూసు వారిని మరికొంత కాలమునకు కలుసుకొనెను, జవహార్ లాల్ పురుషోత్తమ దాసు టాండనులు కూడవారిని కలుసుకొనిరి.

# మహాత్ముడు - పంజాబు

అక్టోబరు 17వ తేదీవరకు మహాత్ముని మీద నిషేధము తొలగింపబడలేదు. తొలగిన మరునాడే యతడు పంజాబు పయనమయ్యెను. అంతకు మునుపెన్నడు మహాత్ముడు పంజాబు వెళ్ళియుండ లేదు. అతని నాహ్వానము చేసిన కిచ్లు, సత్యపాల్, రాంభోజదత్తుచౌదరీ లాసమయమున జయిలులో నుండిరి. మహాత్ముడు లాహోరులో దిగెను. రైల్వేస్టేషన్ ప్రాంతమంతేయు మానవ సముద్రమువలె నుండెను. నాటి దృశ్యము తన జీవితకాలములో నెన్నడును మరపు రాదని యతడు వచించెను. పట్టణములోని యాబాల గోపాలము చిరకాల దేశాంతరవాసమున కేగిన తమదగ్గర బంధువురు స్వాగత మీయ వచ్చినట్లరుదెంచి సంతోషము పట్టజాలకుండిరి. తమ కష్టములన్నియు గట్టెక్కినట్లు, తమ రక్షకుడు వచ్చినట్లు వారనుభవించిరి. తమ నాయకులందరు జయిళ్ళలో నుండుటచే మాలవ్య, మోతీలాల్ నెహ్రూ, శ్రద్ధానంద ప్రభృతులు వారిస్థానము నలంకరించి ప్రజాభిమానము చూరగొనిరి. హంటరు కమిటీ యెదుట సాక్ష్య మీయగూడదని వారందరు నేకగ్రీవముగ తీర్మానించిరి.

ఆ కమిటీని బహిష్కరించి వెంటనే మోతీలాల్ నెహ్రూ, దేశబంధు చిత్తరంజనదాసు, అబ్బాసు తయాబ్జీ, యం.ఆర్. జయకరు, మహాత్మాగాంధీగారలతో కూడిన యధికారేతర కమిటీని కాంగ్రెసు తరఫున నియమించిరి. ఈ కమిటీ వారు పంజాబులోని నలువైపులకు వెళ్ళి సమాచారము సేకరింప నారంభించిరి. ఈకమిటీచేత పనిచేయించు బాధ్యత మహాత్మునిమీద పడెను. కనుక నతనికి గ్రామగ్రామము పోయి ప్రజల నతిసన్నిహితముగ చూడగల యవకాశము చిక్కెను. ఈ పర్యటనలో మహాత్మునకు పాంచాల స్త్రీలతో మరింత యెక్కువ పరిచయమయ్యెను. పూర్వజన్మ సంబంధమున్నట్లతడా ప్రజలతో నాత్మీయత ననుభవించెను. అతడు వెళ్ళిన చోటులనెల్ల స్త్రీలు తండోపతండములుగ వచ్చుచు నతని ముందు వడుకునూలు గుట్టలుగుట్టలుగ గుమ్మరించుచుండిరి. పంజాబు గొప్ప ఖాదీక్షేత్రము కాగలదని యతని కప్పుడే ద్యోతకమయ్యెను. యుద్ధకాలములో నేరాష్ట్రము పంపనంత మంది యుద్ధభటులను పంజాబు పంపించెను. అట్టి రాష్ట్రము ప్రభుత్వ నిరంకుశత్వమును, అధికార దుర్నయములను పెదవి మెదల్పక నెట్లు భరింపగల్గెనా యని యతనికాశ్చర్యము కలిగెను.

చివరకీ కమిటీ పంజాబు అంతయు తిరిగి సేకరించి తయారు చేసిన నివేదికను వ్రాయుభారము మహాత్మునిమీదనే పడెను.

పాంచాలపరాభవగాథ నాకర్ణింప గోరువారి నివేదికను చూచి నచో బ్రిటిషు ప్రభుత్వ నిజరూపము వెల్లడికాగలదు. ఇందులో గోరంతయసత్యమునకు, నుత్ప్రేక్షకు తావీయ బడ లేదు. ప్రతివాఙ్మూలము తగు రుజువు భారముతో తీసికొన బడెను. ఈ నివేదికలోని యే వాఙ్మూలము రుజువుకాబడ లేదని ప్రభుత్వాధికారులచే నిరాకరింపబడలేదు. ఇట్టి నివేదికను మహాత్ముడు తయారు చేసి కర్తవ్యము నాలోచించు చుండెను.

భారతదేశములో 1885లో కాంగ్రెసు సంస్థ స్థాపింపబడి నట్లు మనమెరుగుదుము. ఇది కొంతకాలము సాంవత్సరికోత్సవములు, విద్యాధికుల తర్క సభలు, ఉపన్యాస ప్రదర్శనములు తీర్మానముల సంపుటములు ఇట్లు పదిహేను సంవత్సరములైన తరువాత వందేమాతర నినాదములు, హోమ్‌రూలు ఆశయములు, స్వరాజ్య, వలసరాజ్యప్రతిపత్తుల కోరికలను వెల్లడించుట, ఆందోళన చేయుట ప్రారంభమయ్యెను. మరికొంత కాలమునకీ సంస్థకు కొన్ని యంగములు, స్థాయి కమిటీలు రాష్ట్రస్థాయి వరకు నేర్పర్చబడెను. ఇట్లిది కొన్నికోరికలను వెల్లడించు యంత్రమే కాని చైతన్యము కార్యకలాపము, మానవ విభవము లేకయుండెను. 1919 అమృతసరు కాంగ్రెసులోనే మహాత్ముడు మొదటిసారి కాంగ్రెసుతో నిజమైన జోక్యము కలిగించుకొనెను. ఇంతవరకు

నతడుసాధించిన దంతయు తన స్వంతబాధ్యత మీదనే సాధించెను. అప్పుటప్పుట వ్యక్తిగతముగ నతడు కాంగ్రెసు లకు పోవుచు దూరమునుండియే నాయకులను పరికించుచు, కాంగ్రెసులోని కాలహరణమునకు వగచుచు, శిక్షణలేమికి ధనవ్యయమునకు దుఃఖించుచు, కాంగ్రెసులో సేవాభావ మును, కార్యశూరత్వమును ప్రవేశపెట్టుటకు యోచించు చుండెను.

# అమృతసరము 1919

1916లో లక్నో కాంగ్రెసులోను, కాశీయుపన్యాస పీఠములోను మహాత్ముని వాణిని, యతని రాజకీయ తాత్త్విక సూచనలను మనము చవి చూచియే యుంటిమి. అవి చట్టములవల్ల, సంస్థలవల్ల, వోటులను సంపాదించుకొనుటవల్ల, తయారైన సూత్రములు కావు. పంజాబు హత్యలను గురించి జరిపిన విచారణలో మహాత్ముడు చూపిన చాకచక్యము, దక్షత, నిర్మాణశక్తి నాయకులను మెప్పించెను ఇంతవరకు కాంగ్రెసు కార్యక్రమములను నడిపించుటలో నాయకత్వము వహించుటలో మహాత్మునకెట్టి జోక్యము, స్థానములేదు. లోకమాన్య బాలగంగాధరతిలకు, లాలాలజపతిరాయి, దేశబంధు చిత్తరంజనదాసు ప్రముఖ పాత్రలను వహించిరి. అనిబిసెంటు సతిని కలకత్తా కాంగ్రెసులో అధ్యక్షురాలుగ చేయుటకు పోరాడిన దాది చిత్తరంజనదాసు పేరుపైకి వచ్చెను. తన అభిప్రాయము లెట్లున్నను లోకమాన్యతిలకు చిత్తరంజనదాసుతో నేకమగుచుండెను. మోతీలాల్ నెహ్రూ అమృతసర కాంగ్రెసుకు అధ్యక్షుడు, మాలవ్యపండితుడు కాంగ్రెసుకు పట్టుకొమ్మ. సేలం విజయరాఘవాచారి, లాలాలజపతిరాయి, శ్రద్ధానందస్వామి, బిపినచంద్రపాలు

కాంగ్రెసులో గొప్పవక్తలు. ఈ తరుణమందే మాంటేగు సంస్కరణల పేరిట భారతదేశమునకు కొన్ని రాజకీయ సంస్కరణలు ప్రసాదింపబడునని ప్రకటింపబడెను. దాని మీద వాదోపవాదములు చెలరేగినవి. అప్పుడు పాంచాల మంతయు దుఃఖ, కోప, పరాభవములతో నుడికెత్తిపోవు చుండెను. ఇంతవరకు నిర్బంధములోనుంచిన నాయకులను ప్రభుత్వమువారు క్రమక్రమముగ విడిచిపెట్టుచుండిరి. సంస్కరణలను స్వీకరించుటా మానుటా యను గడ్డుసమస్య బయలుదేరెను. చిత్తరంజనుదాసు యిది యెంతమాత్రము చాలవని, యసంతృప్తికరముగ నున్నవని, త్రోసివేయ దగినవని కచ్చితముగ చెప్పెను. లోకమాన్యుడు తాటస్థ్యము వహించినను చిత్తరంజనుతో కలియుచుండెను. ఈ సంస్కరణ లెట్టివైనను నిరాకరింపరాదని మహాత్ముడు విశ్వసించెను. కాని యతడట్టి పెద్దనాయకులతో విరోధము పెట్టుకొనుట కిష్టపడక అమృతసర కాంగ్రెసు నుండి పారి పోవలెనని భావించి మాలవ్యా, మోతీలాల్ నెహ్రూల కీవిషయము విశద పరచెను. కాని వారందులకొప్పుకొనలేదు. ఈ విషయమెట్లో లాలాహరికిషన్ లాల్‌కు తెలిసెను. ఇది యెంతమాత్రము కూడదని, పంజాబు దేశస్థుల భావముల నిది కలవరపరచునని యతడు మహాత్మునితో చెప్పెను. కాని మహాత్ముడు తన యభిప్రాయములను మార్చుకొనలేక పోయెను. అతని

యంతరాత్మ స్పష్టముగ నతనిని ప్రేరేపించుచుండెను. సంధి కుదురుటకు మార్గము లేవియు కాన్పించుటలేదు. మహాత్ముడు తనతీర్మానము నుపాదించినచో వోటులను లెక్క పెట్టవలసి యుండును. అట్టి సభలో వోటులను లెక్కించుటంత తేలిక పనికాదు. దానికెట్టియేర్పాటులు చేయబడలేదు. ప్రతినిధులు చేతులెత్తి తమ యంగీకారమును సూచించుటే యాచారముగ నుండెను. ప్రేక్షకులకు ప్రతినిధులకు భేదములేక కలసియే కూర్చుందురు. కనుక వోటరులను విడదీసి లెక్కించు తతంగము జరుగవలెనని మహాత్ముడు యోచించుచుండెను. కాని లాలాహరికిషన్‌లాల్ ముందుకు వచ్చి యెట్టి సందేహము పడవలదని కావలసిన యేర్పాటులు చేయబడునని లెక్క పెట్టవలసినచో ప్రేక్షకులు విడదీయబడుదురని వాగ్దానము చేసెను.

మహాత్ముడు తనతీర్మానమును వ్రాసెను. దానిని మాలవ్య, జిన్నాలు బలపరచిరి. ఇరుపక్షముల యుపన్యాసములు ప్రారంభమయ్యెను. రాజీమార్గములను వెదకువారు వెతుకుచునేయుండిరి. మాలవ్యాజీ రాజీకితన సర్వశక్తులను వినియోగించుచుండెను. ఇంతలో జయరాందాసు ఒకసవరణ తెచ్చెను. ఇది మహాత్మున కంగీకరముగనే యుండెను. మాలవ్యదానిని పరీక్షించుచుండెను. లోకమాన్యుడు చిత్తరంజను యంగీకారముకొరకు చూచుచుండెను. ఇతడు బిపినచంద్రపాలు వైపు

చూచుచుండెను. ఇట్లుండ మాలవ్యాజీ కాగితమును లాగుకొని రాజీకుదిరెనని యుత్సాహముతో కేకలు వేసెను. ఇక కాంగ్రెసుపందిరి యంతయు జయజయ ధ్వానములతో మిన్ను ముట్టెను. ప్రజలనిరాశ మంచువిడినట్లువిడిపోయెను. సర్వత్ర హర్షధ్వానములు చెలరేగెను.

పంజాబు దురంతముల వలన పాంచాలము నావరించిన దుఃఖచ్ఛాయలొక్కసారిగ పటాపంచలయ్యెను. జయిళ్లలో వందలకొలదిగనున్న పంజాబీలను ప్రభుత్వమిక నిముడ్చుకొనజాలక విడిచివేయుచుండెను. హరికిషన్ లాల్ నదివరకే విడిచిపెట్టిరి. మౌలానా, మహమ్మదాలీ, షౌకతాలీసోదరులిద్దరు జయిలు నుండిసరాసరి కాంగ్రెసుకేవచ్చి 'జయిలుకు తిరుగుటిక్కెటుకూడ తెచ్చుకొంటిమి' అని చలోక్తిగ పలికిరి. నాటినుండి స్వరాజ్యము వచ్చువరకు కాంగ్రెసు నాయకుల తిరుగుటిక్కెటులు సామాన్యవిషయమైపోయెను. అమృతసర కాంగ్రెసు దిగ్విజయముగ జరిగిపోయెను. కానిదీనితో మహాత్ముని బాధ్యత హెచ్చెను. జలియనువాలాబాగు హత్యల స్మారకార్థము అయిదు లక్షలనిధి వసూలు చేయుటకా కాంగ్రెసులో తీర్మానము చేయబడెను. ప్రజాకార్యములకు డబ్బువసూలు చేయుటలో మహాత్ముడు దక్షిణాఫ్రికాలో యనుభవము సంపాదించెను. మాలవ్యపండితుడు సంస్థానాధిపతులను పిండుటలో పేరుగడించి 'గొప్పయాచకుడు' అనిపే

ఉపొందెను, పై నిధికి మహాత్ముడే ధర్మకర్తగ నేర్పాటు చేసిరి. బొంబాయి నగరవాసు లతిధారాళముగ నతనికి విరాళములనిచ్చుటచే చాల ధనము పోగుచేయబడెను.

కాంగ్రెసు యెట్లుపని చేయుచున్నది మనముచూచితిమి. మహాత్ముడు కాంగ్రెసుకు దూరముగ నుండియే ప్రజల నెట్లా కర్షించెనో చాంపరాను ఖేడా బీద కర్షకలోకము నెట్లునడపి జయపరం పరలను గాంచెనో, అహమ్మదాబాదు కార్మికుల నెట్లు సంఘటితపరచి యజమానులకు వారికి జరిగిన పోరాటము నెట్లు విజయవంతముగ నడిపించెనో మనమిది వరకే చూచియుంటిమి, అహమ్మదాబాదు కార్మిక సంఘములు నేటికిని ప్రపంచమునకే యాదర్శప్రాయమగు సంఘమనుట యతిశయోక్తి కాదు.

ఇక అమృతసర కాంగ్రెసులో ప్రవేశించినది మొదలు కాంగ్రెసుకు నతనికి నవినాభావ సంబంధమేర్పడెను. అతడే కాంగ్రెసు. కాంగ్రెసేయతడు. అతనిముద్రయే కాంగ్రెసు మీదపడెను. అతడులేని కాంగ్రెసు, రానికాంగ్రెసు కాంగ్రెసేకానట్లుండెను. 1920 మొదలు స్వాతంత్ర్య సిద్ధిచేకూరు వరకు ప్రభుత్వముతో జరిగిన ప్రతిపోరాటమునకు నతడే యధినాయకుడు. పోరాట విధానమును, సమయమును నతడే నిర్ణయింపవలెను. దానినాపివేయ వలసివచ్చుచో

నతడే యాపివేయవలెను. తిరిగి ప్రారంభింపవలసినచో నతడే ప్రారంభము చేయవలెను. రాజీలను సంధిషరతులను, రాయబారములను నతడే నడుపవలెను. ఇది యదియననేల? భారత రాజకీయముల నిరువదియేడువత్సరములతడు అవిచ్ఛిన్నముగ నేలెను.

కాంగ్రెసు నాయకులతని శక్తి నిగ్రహించి నానాటికి పెరిగి పెద్దదికావలసిన కాంగ్రెసుకు తగిన చట్టనిర్మాణమును చేయవలసినదని యతనినే కోరిరి. దక్షిణాఫ్రికాలో నతడుగడించిన చిరకాలానుభవ మెవరికిని లేదు. ఎంతటి విషయమునైనను కుదించి వ్రాయుట, సుస్పష్టముగ వ్రాయుటయతని సొమ్ము. అంతటి వరకు గల కాంగ్రెసు నిరుమావళి గోఖ్లేగారి ప్రసాదము. ఈయంత్రమును నడుపుటకు కొద్దిసూత్రములు మాత్రమే సృష్టింపబడెను. కాంగ్రెసుకు కాంగ్రెసుకు మధ్య పనిచేయుట కేసాధనలేదు. సంవత్సరములోనే యేదేని విషమస్థితి యేర్పడినచో నేమిచేయుటకు మార్గము లేదు. కాంగ్రెసుకు ముగ్గురు కార్యదర్శులుండెడివారు. వారిలో నొక్కడే పనిచేయును. అతడైనను నంతకాలము పనిచేయువాడుకాడు. అతడొక్కడే కాంగ్రెసు ఆఫీసు నడపవలెను. భావినిగురించి యోచించుట, గతవత్సర యొప్పందములను నెరవేర్చుట ముఖ్యవిషయము లయ్యెను. నిత్యవ్యవహారములను పరిష్కరించుటకు మార్గము లేదు. కాంగ్రెసు ప్రతినిధులకు, రాష్ట్రి

ప్రతినిధులకుకూడ మితిలేదు. కనుక కాంగ్రెసు కొక చట్టము చేయవలసివచ్చెను. లోకమాన్యతిలకు, చిత్తరంజనుదాసులు ప్రజలలో చాల పలుకుబడి కలవారు. కనుక వారియనుమతి పొందిన మరియిద్దరు సభ్యులతో నతడొక చట్టమును తయారుచేసెను. ఈచట్టము ప్రకారము నడచినచో స్వరాజ్యము సిద్ధించునని యతడువిశ్వసించెను. 1920 మొదలు కాంగ్రెసు మహాత్ముడునిర్మించిన సూత్రముల మీదనే వర్ధిల్లెను.

అసలు ప్రజలు గ్రామములలోకలరు. బ్రిటిషు ప్రభుత్వము గ్రామమునుండియే వేరులు పాతుకొని యుండెను. కనుక గ్రామ, తాలూక, జిల్లా, రాష్ట్రకాంగెసు సంఘములు. స్థాయిసంఘములు, కాంగ్రెసు ప్రాథమిక సూత్రములు, పావలా సభ్యత్వము, జనాభానుబట్టి రాష్ట్రప్రాతినిధ్యము, ఎన్నికలనియమములు, తగాదాల పరిష్కారములు, క్రమశిక్షణము, వాలంటీర్లు, శిక్షణశిబిరములు-దీని నంతనుమించిన నిర్మాణశాఖ- యీవిధముగ మహాత్ముని చేతిలో కాంగ్రెసు సంస్థ దినదినము వృద్ధిపొందుచు క్రమముగ బ్రిటిషు ప్రభుత్వము నెదిరించి పోరగల యపూర్వ శాంతిసైన్యముగ తయారయ్యెను.

# 1920 సంవత్సరము

ప్రపంచ చరిత్రలోనే కొన్ని సంవత్సరము లతి ప్రధాన సంవత్సరములుగా నుండును. 1920 ఆధునిక భారతచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపదగిన సంవత్సరము. రెండువంద లేండ్లు అవిచ్ఛిన్న నిరంకుశత్వముతో బాధ్యతారహితముగ పరిపాలనచేసి ప్రపంచరాజ్యములలో నాయకమణిగా భావింప బడి 'రవియస్తమింపని సామ్రాజ్య శక్తి' పైనే బలము లేని యొక బీదజాతి యంతయు నొక్కుమ్మడిగ తిరుగబడి "నీప్రగల్భ వాక్యముల నిక కట్టిపెట్టుము. మేము కండ్లు తెరచితిమి. మాకొక మహానాయకుడు, అపూర్వరాజకీయ కర్ణధారి, భారతాభ్యుదయ నిజకీలక ప్రయోగ దక్షుడు, పాలక పాలితవర్గ శుభంకరుడు, ప్రజాతత్త్వవేదియై యనేక సాత్త్వికయుద్ధములలో గెలుపొంది విజయపతాకల నందిన వాడు, పుణ్యమూర్తియై మఠములలో క్రుమ్మగిపోక ప్రజా సహస్రముల నొక్కచే సంజ్ఞచే నెంతటి త్యాగములకైనను సిద్ధపరచి నూతన సాత్త్విక రణరంగములలోని కురికింపగల యుసహాయ శూరుడు లభించినాడు. నిరంకుశ ప్రభుత్వమున కెదురు చెప్పగల శక్తిని మాకు ప్రసాదించిన దివ్యయోధుని పతాకక్రింద మేమిక నీపై యెదురు దాడులు సాగింపగలము"

అని బ్రిటిషు ప్రభుత్వమునకు ప్రపంచమునకు కూడ చాటిన వత్సరము.

అమృతసర కాంగ్రెసులోనే మితవాదులు లేచిపోయి కలకత్తాలో ప్రత్యేక సభ చేసికొనిరి. కాంగ్రెసులో ప్రభుత్వ సంస్కరణాలను స్వీకరించుటయా తిరస్కరించుటా యను సమస్య యుద్ధభూమికాగా మహాత్ముడు వాటిని స్వీకరింప మనియే చెప్పెను. కొందరు దానికి వ్యతిరేకులుగ నుండిరి. ఆ కాంగ్రెసు జరిగినకొద్ది మాసములకే పరిస్థితులు శరవేగ ముతో మారుచుండెను. నూతన పరిస్థితు లేర్పడెను. కొత్త పరిస్థితులకు తగినట్లు మహాత్ముడు సహాయ నిరాకరణ మును సమర్థించెను. అంతకమునుపు సహాయముచేయ కూడ దనిన వారిప్పుడు సహకారము చేయువలెననిరి.

బ్రిటిషు ప్రధానమంత్రి యుద్ధకాలములో భారత దేశ మునకు, వచ్చుటి మహమ్మదీయులకు ననేక వాగ్దానములను చేసెను. యుద్ధము ముగియగానే యతడు వాటినిభంగపర చెను. టర్కీ సామ్రాజ్యమున కెట్టివిచ్ఛిత్తు కలుగకుండ కాపా డెదమనిన బాసను గాలికెగురగొట్టి యింగ్లండు ఫ్రాన్సులు టర్కీ సామ్రాజ్యములోని యాసియా భూభాగములనుపంచు కొనెను. ఇది భారత మహమ్మదీయులలో కలవరముకలిగిం చెను. 1919జనవరి 20వ తేదీని మహమ్మదీయులందరు డాక్టరు అన్సారీ నాయకత్వముక్రింద వైస్రాయి వద్దకు రాయబారము

వెళ్లిరి. లాయిడ్ జార్జిప్రభువు తమకిచ్చిన వాగ్దానములను నెరవేర్చుమని, యిస్లాము మతపుణ్యక్షేత్రములు కాలిఫ్ అధికారము క్రిందనే యుండవలెనని వారుకోరిరి. మహమ్మదీయసైనికులు, ప్రజలు మిత్రమండలికి గావించిన సహాయమును, బాధ్యతగల రాజకీయ ధురంధరులు చేసిన వాగ్దానములను జ్ఞప్తికి తెచ్చుచు మార్చి 17వ తేదీని సీమకు వారొక రాయబారమంపిరి. ఈరాయబారము వలన ఫలితమేమియు చేకూరలేదు. భారతదేశములోని మహమ్మదీయులీ కారణముచే నట్టుడికి నట్లుడికి పోవుచుండిరి. ఆలీసోదరులు కిలాఫతు సమస్యను లేవదీసి దేశమంతట ప్రచారము గావించుచుండిరి. ముసల్మానులు దౌర్జన్య రాహిత్యము నవలంభింపవచ్చునా? దీనికివారి మతమంగీకరించునా యను సమస్య బయదేరెను. మౌల్వీలు, ఉలేమాలు మహాత్మునితో నీవిషయము చర్చించిరి. ఇస్లాముమతము దానికి వ్యతిరేకము కాదని, దానినొక నీతిగా పాటింప వచ్చునని వారంగీకరించిరి. ఒకకిలాఫతు కాన్ఫరెన్సులో అసహాయోద్యమ తీర్మానము కూలంకషముగ చర్చింపబడి యామోదింపబడెను.

ఇది జరిగిన కొద్దికాలమునకు గుజరాతులో రాష్ట్రరాజకీయ మహాసభ జరిగెను. ఇట్టిచర్చ కాంగ్రెసులో జరుగవలెనుకాని రాష్ట్రసభలలో జరుగరాదని యభ్యంతర మొకటి వచ్చెను. అభ్యుదయ విషయములను గురించి చర్చించుట

కెట్టియాటంకము నుండరాదని రాష్ట్రసభలలోనే యిట్టివి సూచింప బడవలెనని మహాత్ముడు సమర్థించెను. వల్లభాయి పటేలు, అబ్బాసుతయాబ్జీల వ్యక్తిత్వములవలన గుజరాతు రాష్ట్రసభలో నీతీర్మాన మామోదింపబడెను.

1920 సెప్టెంబరులో కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెసు జరిపించుటకు అ. భా. కాం. సంఘము తీర్మానించెను. అస హాయోద్యమ తీర్మానమును చర్చించుటకే యిది ప్రత్యేక ముగ పిలువబడెను. దీనికొరకై బహ్మాండమైన యేర్పాటులు గావింపబడెను. అమెరికాలో ప్రవాసము చేసివచ్చిన లాలా లజపతిరాయి దాని కధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఆసభకు కాంగ్రెసు ప్రతినిధు లొక ప్రత్యేక రైలులోను కిలాఫతు ప్రతినిధు లింకొక ప్రత్యేక రైలులోనువచ్చిరి.

షౌకతాలీ కోరికమీద మహాత్ముడు బండిలోనే యసహా యోద్యమతీర్మాన ముసాయిదా తయారుచేసెను. ఈతీర్మా నము నాకాంగ్రెసులో ప్రవేశపెట్టుబాధ్యత యతనిమీదనే కలదు. లాలా లజపతిరాయి యభిప్రాయము లెట్లుండునో యతడెఱుగడు. అనిబిసెంటుసతి మాలవ్యా పండితుడు, మోతీ లాల్ నెహ్రూ, దేశబంధు చిత్తరంజనదాసు, విజయరాఘ వాచారి మొదలగు నుద్దండు లాసభకు హాజరైరి. తనతీర్మాన మేమగునో యని మహాత్ముడు యోచించుచుండెను. కిలా ఫతు, పంజాబులకు జరిగిన యక్రమములను నివారించుటయే

దాని లక్ష్యమని మహాత్ముఁడు స్పష్టపరచెను. వీటికంటె స్వరాజ్య సంపాదన యతిముఖ్యమని దానినికూడ చేర్చవలె నని విజయరాఘవాచారి సూచించెను. మోతీలాల్ నెహ్రూ దానిని సమర్థించెను. మహాత్ముఁడు దీనికంగీకరించెను. కలకత్తా సభయంతయు నీచర్చలతో దద్దరిల్లిపోయెను. ఈ సమయములోనే లోకమాన్యతిలకు దివంగతుడయ్యెను. ఈ వార్త వినగానే మహాత్ముఁడప్రయత్నముగ 'నా గొప్పయండ కూలి పోయెను' అని వగచెను. దేశబంధు చిత్తరంజనదాసు లాలా లజపతిరాయలు సందేహ మనస్కులైయుండిరి. మోతీలాల్ నెహ్రూ మొట్టమొదట దీనినామోదించి చిత్తరంజనదాసును కూడ మార్చివేయుట కంగీకరించెను. కలకత్తా ప్రత్యేక సభలో నామోదింపబడిన యీ తీర్మానము నాగపుర కాంగ్రెసు మహాసభలో నామోదింపబడవలెను.

# సహాయ నిరాకరణ తత్త్వము

ఈ తత్త్వమును భారత దేశమునకు లోకమునకు ప్రసాదించినవాడు మహాత్ముడు. ఇది యొక నూతన విధానము. రాజకీయములలో నెన్నడు ప్రయోగింపనినీతి. అసత్యమును, దుర్మార్గమును, అధర్మమును, దౌర్జన్యమును సహింపరాదు. వీనిని యెదుర్కొనవలెను. కాని వీనిని యెదుర్కొనుటలో నసత్యమును సత్యముచేత, నధర్మమును, ధర్మముచేత దుర్మార్గమును సన్మార్గముచేత, దౌర్జన్యమును ప్రేమచేత సాధింపవలెను. ఇందులో రహస్యమునకు చోటుండరాదు. ద్వేషమునకు తావులేదు. 'పాపమునే ద్వేషించి పాపిని ప్రేమింపవలెను' అను ప్రేమతత్త్వము దీనికి పునాది.

"ఇది వ్యక్తులయెడల పనికివచ్చునేమోకాని సంస్థలయెడల పనికిరాదు. మతమునకు సంబంధించినది కాని రాజకీయములలోను, సంఘముమీదను దీనికిస్థానములేదు. ప్రజలు కోపమును, ద్వేషమును అణచుకొనజాలరు. దౌర్జన్యమును దౌర్జన్యముచేతనే జయించినట్లు చరిత్రచెప్పుచున్నది. దీనికి తగిన నిగ్రహమును ప్రజలు చూపజాలరు. హృదయము లేని యొకసంస్థపై దీనిని నుపయోగించి లాభములేదు.

ఇది వెఱ్ఱితనము. ఇది కేవలము సన్యాసులకు నరణ్యవాసులకు మాత్రమే పనికివచ్చు తత్వము. ప్రజలందరు జ్ఞానులు కాజాలరు. ఇది రక్తపాతమునకు, జాతి ద్వేషమునకు, నరాచకమునకు దారితీయును " అను ననేక విమర్శలు దీనిమీద బయలుదేరెను. ఇట్టి విమర్శలమధ్య నిది ప్రారంభమై యిరువదియేడేండ్లు యెటులపని చేసినది మనమిక ముందు వినగలము.

బ్రిటిషు ప్రభుత్వము మారవలెను. లేదా యంతమొందవలెను అని దీని యాశయము. సాత్విక నిరోధము సత్యాగ్రహము, సహాయ నిరాకరణము, అసహాయోద్యమము - ఇవన్నియు కొంచెమించుమించు నామాంతరములు.

ఈయుద్యమము రెండుముఖములుగ పనిచేయును. ఒకటి నిర్మాణరంగము. స్వరాజ్యసంపాదనకు తగిన దక్షతనిది చేకూర్చవలెను. వచ్చిన తరువాత దానిని నిలుపుకొనగల శక్తినికూడ నిదిప్రసాదించును. స్వరాజ్యమొకమెట్టు దాని యాశయము సంఘసేవ. ప్రజాసేవ. కనుక నిర్మాణ కార్యక్రమము ద్వారా సంఘ దుర్బలత్వము, సాంఘిక దురాచారములు, చెడుగులు, అక్రమములు తొలగింప సమకట్టవలెను. ప్రభుత్వముతో పోరుటకు కూడ నిర్మాణకార్యక్రమ మవసరము. ఇదియే యతనిజీవితసమస్య. స్వరాజ్యసమస్యయే లేనిచో నతడు తన కాలమునంతను దీనికే వినియోగించి

యావత్ప్రపంచమునకూడ దీని ద్వారానిర్దుష్టము, పునీతము, అమృతమయము గావించెడివాడు.

అతని రెండవ యస్త్రము సత్యాగ్రహాస్త్రము. దీనినతడు ప్రభుత్వముపై నుపయోగించును. మనసహాకారము చేతనే ప్రభుత్వమిచ్చట నిలువగలదు; నిలిచియున్నది. ఈసహకారము లేకుండ చేసితిమేని యది యొక్కనిమిషము పనిచేయు చాలదు. మనము మొదట పవిత్రులము కావలెను. మనబలహీనతలనుపోగొట్టుకొనవలెను. అనైకమత్యమును నజ్ఞానమును పోగొట్టుకొని ప్ర[illegible] పోరాడవలెను. ఈయుద్యమము భయులను పవిత్రము చేయుట కేర్పడినమహోద్యమము. ఇందులో శత్రుత్వ మొకచెడు సంస్థవిధానము, పద్ధతిమీాద కాని యేవ్యక్తిపైన జాతిపైనకాదు. ప్రభుత్వము నెపుడు, యేవిధముగ నెదిరింపవలెనను విషయమును మహాత్ముడే నిర్ణయించును. ఈలోపల ప్రజలు తమపనులను నెరవేర్చవలసినదే. ఈ యుద్యమమున కతడే యధినాయకుడు; దీనిప్రారంభోప సంహారములను నిర్ణయించువిధాత యతడే. 1920 లో నిది యేరూపమునుపొందెనో మనము చూడవలసియున్నది. కలకత్తా ప్రత్యేకకాంగ్రెసులో నీ క్రింది తీర్మానమామోదింపబడెను. దీనికి 1889 మంది యనుకూలురు 884 మంది ప్రతికూలురు. 'కిలాఫతు సందర్భమున భారత, సామ్రాజ్య ప్రభుత్వములు రెండు తోటి మతస్థులైన మునల్మానులకు

చేసిన వాగ్దానములను భంగముచేయుటవలనను, 1919 ఏప్రిల్‌లో పంజాబులో అమానుషదురంత క్రియలను జరిపిన వారిని తగు విధమున శిక్షింపకపోగా ప్రజాదుఃఖములకు, నవమానములకు కారణభూతుడైన సర్ మైకేల్ ఓడ్వ యరును సమర్థించి నందువలననూ, పార్లమెంటుచర్చలనుబట్టి బ్రిటిషువారికి భారతప్రజలయందు సోదరభావము లేదని రూఢి యగుటవలనను, వైస్రాయి ప్రకటనలవలన కిలాఫతు, పంజాబు సమస్యలపట్ల పశ్చాత్తాప మెంతమాత్రము లేదని తేలుటవల్లను-ఈ రెండుదోషములకు సరియైన పరిహారము కలిగినకాని భారతప్రజలు శాంతింపరు కనుకనున్ను, యిక ముందిట్టి యవమానములు అన్యాయములు జరుగకుండుటకు, జాతీయగౌరవము నిలబెట్టుటకు స్వరాజ్య మత్యవసరము. పై యన్యాయములను నివారించుటకును, స్వరాజ్యమును స్థాపించుటకును మహాత్ముని దౌర్జన్యరహిత సహాయ నిరాకరణ సిద్ధాంతము నంగీకరించి క్రమ క్రమముగ నమలులో పెట్టుట తప్ప వేరొకమార్గములేదు కనుక భారతప్రజలీక్రింది కార్యవిధానము నాచరింపవలెనని తీర్మానింపబడినది.

(1) ప్రభుత్వ గౌరవోద్యోగములను, బిరుదులనుత్యజించుట.

(2) ప్రభుత్వాధికారులవల్లను, వారి గౌరవములకొరకును నేర్పాటు చేయబడిన దర్బారులకు, సన్మానములకు పోవ నిరాకరించుట.

(3) ప్రభుత్వపాఠశాలలను కళాశాలలను బహిష్కరించి వాటిస్థానే జాతీయ పాఠశాలలను స్థాపించుట.

(1) బ్రిటిషు న్యాయస్థానములను బహిష్కరించి వాటిస్థానే గ్రామపంచాయతులను నెలకొల్పుట.

(5) మెసపొటోమియాలో పనిచేయుటకు సైనికులు గుమాస్తాలు పోకుండుట.

(6) నూతన శాసనసభాయెన్నికలలో నెవరును అభ్యర్థులుగా నిలువకుండుట అట్టిప్రయత్నములోనున్నవారు మానుకొనుట. దీనికి వ్యతిరేకముగ నిలిచిన యభ్యర్థులకు వోటర్లు వోటువేయరాదు.

(7) విదేశవస్తువుల నన్నిటిని బహిష్కరింపవలెను.

ఈ తీర్మానముమీద విద్యాధికులలోనే యెక్కువకుళ్ళంకలు బయలుదేరెను. లోకమాన్యతిలకు కుడిభుజమైన కపర్దికిది రుచింపలేదు, "కాంగ్రెసు రాజకీయములను మరచి ప్రజలు దృష్టి నాత్మబలమువైపు మరలించుచున్నది. నూతన శాసనసభలను విడనాడుట రాజకీయశిక్షణము, పోరాటము పొందు అవకాశములనుపోగొట్టుకొనుటేయగును. ప్రజల సహనశక్తి దీనివలన యభివృద్ధిచెందవచ్చును. కాని రాజకీయసంగ్రామశక్తి, వివేకముకలుగవు. ఈ బహిష్కార త్రయము నిరర్థకము. వీటిలో రాజకీయ ప్రయోజనము లేదు. 'స్వరాజ్యసభ' గాంధీవంటి యుదార నైతికాశయ

ములుగల మహాపురుషుని స్వాధీనములోనే యుండవచ్చును గాక. అదికూడ ప్రజాస్వామికసిద్ధాంతమునకు విరుద్ధమైనది. అభ్యంతరమైనది." అని యొక ప్రకటనచేసెను.

ఈ 'స్వరాజ్యసభ'ను గురించి మనకు కొంత తెలియ వలసియున్నది. రాజకీయములు తీవ్రరూపము దాల్చు చున్నవను కారణముచేత అనిబిసెంటు సతి హోమురూలు సభాధిపత్యమును విడిచిపెట్టెను. గాంధీజీ దీని కధ్యక్షు డయ్యెను. కేవల రాజకీయములకు మాత్రమే సంబంధించిన సంస్థతో జోక్యముకల్పించుకొనుట నాపద్ధతికాదు. నేను బాగుగ తరచి స్నేహితులతో సంప్రదించి యీ సభలో చేరితిని. నా వ్యక్తిస్వాతంత్ర్యమును పోగొట్టుకొనకుండ దక్షిణాఫ్రికాలో నాకు కలిగిన ప్రత్యేకానుభవములను, ప్రత్యేకపద్ధతులను అవలంబించి నే నీసంస్థకు దేశమునకు తోడ్పడగలనని నాయభిప్రాయము. నే నిందులో చేరక పూర్వము బొంబాయిరాష్ట్ర ప్రజలతోను, తదితరులతోను కూడ చర్చించితిని. హిందూమహమ్మదీయయైక్యత, భాషా ప్రయుక్తరాష్ట్రవిభజన, జాతీయభాషా నిర్ణయము, కిలాఫతు సమస్య మొదలగువానిని గురించి చర్చించితిని. భారతజాతి కాలమును చాలవరకు పై పనుల కుపయోగించునట్లు నేను చూతును. జాతీయపునర్నిర్మాణములో రాజ్యాంగ సంస్క రణములకు రెండవస్థానముండునేకాని ప్రథమస్థాన ముండ

జాలను. నేను సూచించు కార్యక్రమమే తీవ్రవాదులు కోరు సంస్కరణలను తీసికొని రాగలదు. ఆ యంశములను త్రికరణశుద్ధిగ నాచరింతుమేని సంపూర్ణ స్వరాజ్యపరిపాలన చేరువకాగలదు. అఖిలభారత హోమురూలుసభ యేప్రత్యేక కక్షకు సంబంధించినది కాదు. నామట్టుకు నే నేపక్షమునకు సంబంధించను. ఇక ముందుకూడ నేదోయొక పక్షమువహింపను. కాంగ్రెసుపార్టీసంస్థ కాదు. అన్నిరాజకీయ కక్షలవారు కాంగ్రెసును జాతీయసంస్థగా స్వీకరించి తద్వారా జాతీయ కార్యక్రమమును నిర్ణయింపవలెనని నాకోరిక. హోంరూలు లీగు విధానము, కాంగ్రెసు-పార్టీకక్షలతో చెందక జాతీయ స్వభావమును నిలుపుకొనునట్లుగ నేను విశ్వప్రయత్నము చేతును" అని మహాత్ముడొక ప్రకటనచేసెను కాంగ్రెసు అసహాయోద్యమమున కంగీకరింపకపోవచ్చునని మహాత్ముడు 'స్వరాజ్యసభ' స్థాపించెను. కాంగ్రెసే యతనియుద్యమము నంగీకరించుటచే స్వరాజ్యసభ యవసరము లేకపోయెను.

"నా కీ కార్యక్రమము చాలయిష్టము. కాని యసహాయోద్యమము సూచించు స్వార్థత్యాగమునకు ప్రజలు సంసిద్ధులుగా లేరేమో యని నా సందేహము. ఉద్యమాభివృద్ధికి నేనెంతమాత్రము అభ్యంతరము కల్పింపను. మీకు విజయ మగుగాక! సామాన్య ప్రజలు మీ సందేశము నాకర్ణింతురేని నేను మీ కమితోత్సాహముతో తోడ్పడ

గలను” అని తనతో తిలకు చెప్పినట్లు మహాత్ముడు ‘తిలకు స్మారక విషయములు’ అను గ్రంథములో వ్రాసెను.

“ఈ యసహాయోద్యమము కేవలమొక స్వప్న వ్యాపారము; ఆచరణసాధ్యముకాని వెర్రిప్రణాళిక. ఇది జయప్రదము కానేరదు. పెద్దలు, పిన్నలు కూడ దీనిని నిరాకరింతురు. ఒకవేళ యిది కొనసాగునేని భారతదేశమున యల్లరులు, రాజకీయ కల్లోలము, వినాశము తప్పవు” అని ప్రభుత్వమువారు జోస్యము చెప్పిరి.

ఈ విధముగ నసహాయోద్యమము విపరీత పరిస్థితులలో ప్రారంభమయ్యెను. మహాత్మునకు తప్ప దీనియందెవరికిని పూర్తివిశ్వాసము లేదు. దీనిలోనున్న ముఖ్యకీలకమే వారి కర్థము కాలేదు. రాజకీయవేత్తలిది రాజకీయమే కాదనిరి. పాశ్చాత్య విజ్ఞానము, వారి రాజకీయసంస్థలు మాత్రమే కచ్చా పచ్చాగా తెలిసినవారికిది పిచ్చివేదాంతముగ కాన్పించెను. ఇది యొక సన్యాసి మానసికవక్రతయని దీని నిరువదినాలుగు గంటలలో భరతము పట్టవచ్చునని బ్రిటిషు ప్రభుత్వము గర్వించెను. భారతదేశములోనే పుట్టిన కొంతమంది యాంగ్ల పండితులకిది గోచిపాతరాయుని కాకిగోలగా కాన్పించెను. కాని మహాత్ముని జగన్నాథరథ మీమాడతకుర్చీ రాజకీయ వాదుల ప్రతాపములను లెక్కసేయక ముందుకు సాగిపోవు చుండెను.

# నాగపుర కాంగ్రెసు

కలకత్తా ప్రత్యేక సభలో నామోదింపబడిన తీర్మానము నాగపుర కాంగ్రెసులో నామోదింపబడవలెను. ఇది యేటేట జరుగు పెద్ద కాంగ్రెసు. దీనికి వేలకొలది ప్రతినిధులు లక్షలకొలది ప్రేక్షకులు వచ్చిరి. ఇది యత్యంతకోలాహాల ముగ జరిగెను. ప్రజలందరు నీ సభకు పెండ్లికి వచ్చినట్లు వచ్చిరి. కొంతమంది 'అమే తుమే' తేల్చుకొనుటకు వచ్చిరి. చిత్తరంజనదాసు కలకత్తా తీర్మానమును రద్దు చేయించుటకు 250 మంది ప్రతినిధులతో వచ్చినట్లు, ఆయన పక్షము వారికి జితేంద్రలాల్ పక్షము వారికి కొంత ముష్టా ముష్టి జరిగినట్లు, దీనికొరకతడు 36,000 ఖర్చు పెట్టినట్లు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు కాంగ్రెసు చరిత్రలో వ్రాసిరి. ఈ సభకు 14582 మంది ప్రతినిధులు వచ్చిరి. ఇందులో 1050 మంది మహమ్మదీయులు. 169 మంది స్త్రీలు. దాక్షిణాత్యులలో సుప్రసిద్ధ కాంగ్రెసువాది సేలం విజయరాఘవాచార్యులు దీని కధ్యక్షతవహించెను. కలకత్తా కాంగ్రెసు కధ్యక్షుడైన లాలాలజపతిరాయి అసహాయోద్యమునకు వ్యతిరేకి. విజయరాఘవాచార్యులవారికి దానియందు సవతి తల్లి ప్రేమయని మహాత్ముని కెట్టి యాటంకము కలిగింపక తన కనుకూలముగ లేని తీర్మానము బహిరంగసభలో చర్చకు వచ్చినపుడెల్ల తన స్థానము ఖాళీ చేయుచుండెడివాడని పట్టాభిగారు వ్రాసిరి.

నాగపుర కాంగ్రెసు భారతదేశ రాజకీయములలో నూతనాధ్యాయము నుపక్రమించెను. అది యొక దుర్బల జాతి, యైకమత్యము నెరుగనిజాతి, రాజకీయ శిక్షణ, సైనిక శిక్షణ లేనిజాతి, కత్తి; కర్ర కూడ నుపయోగింపవీలు లేని జాతి సమస్త యుద్ధసామగ్రి, మారణసామగ్రి కల జాతిపై చేసిన బహిరంగ తిరుగుబాటు. నాగపుర కాంగ్రెసు మహాత్ముని కఖండవిజయము. గారడివానిచేతిలో పాదుం కాయి గిరగిర తిరిగిపోవు నట్లుతనిచేతిలో కాంగ్రెసు మారి పోయెను. చివరకు చిత్తరంజనదాసే అసహాయోద్యమతీర్మా నమును ప్రవేశపెట్టగా లాలాలజపతిరాయి దానిని బలపర చెను. జయింప వచ్చినవారు జయింపబడిరి. కాంగ్రెసు యొక్క ప్రధాన సూత్రము, దాని యంగనిర్మాణము కూడ మార్పు చెందెను. కాంగ్రెసు అవతారమే మారిపోయెను.

హేమిలను నగరములోని నాగస్వరపాటకుని పాటవిన గనే యాబాలగోపాలము యిండ్లువిడిచి బయటకు వచ్చునట్లు మహాత్ముని పిలుపు వినగనే భారత ప్రజానీకమంతయు నతనివెంటపడిరి. కలకత్తాలో తిరస్కరింపబడు ననుకొనిన తీర్మానము నాగపురములో దిశలుపిక్కటిలునట్లు జయజయ ధ్వానములమధ్య నామోదింపబడెను. వందలకొలది వత్స రములు స్తబ్ధముగ పడియుండినజాతి ప్రజలలోనొక యపూర్వోత్సాహము ప్రజ్వరిల్లెను.

బ్రిటిషురాజ నీతిజ్ఞులు భారతదేశములో నతియుక్తిగ

కట్టిన కట్టడములలో కృటాకృటిగ కూలనారంభించెను. కాలే జీలను, విశ్వవిద్యాలయములను ఖాళీచేసి విద్యార్థులు శాంతి సైన్యములోను, స్వరాజ్య ప్రచారక దళములలోను జేరు చుండిరి, పార్టీలు కోర్టులను బహిష్కరించి పంచాయతుల ద్వారా వివాదములను పరిష్కరించు కొననారంభించిరి. మునసబులు జడ్జీలు ఖాళీగా కూర్చొను చుండిరి. జాతీయ కళాశాలలు, విద్యాలయములు ప్రతిచోట బయలు దేరెను. విశ్వవిద్యాలయములు, కాలేజీలు పడిపోవుచుండుటచే తమ బ్రతుకుతెరువు పోవుచున్న కార్పణ్యముతో కొందరు 'అప్రాచ్యవిద్యావేత్తలు' మహాత్ముడు విద్యను మంటకలుపు చున్నాడని, యతడువిద్యావేత్తయా యని వాపోవ మొదలిడిరి. శాసనసభలకు పోటీచేయదలచుకొన్న జాతీయవాదులందరు పోటీనుండి విరమించుకొనిరి. బ్యాలటుపెట్టెలు ఖాళీగా పంపి వేయబడెను. ఎన్నికోద్యోగులందరు పనిలేకకూర్చుండిరి. ఆనాడు వోటువేయుటకు వచ్చిన వోటరేకన్పించలేదు.

ఉద్యోగస్థులు గ్రామమునసబు కరణములు రాజీనామా లిచ్చివేయుటచే కొన్నిచోట్ల పన్నువసూళ్లే ఆగిపోయెను. విదేశవస్త్రములు గుట్టలుగుట్టలు తగులపెట్టబడెను. తిలకు స్వరాజ్యనిధికి కోటిరూపాయిలు వసూలుచేయబడెను. ప్రతి రాష్ట్రములోను జాతీయవిద్యాపీఠములు, ఆశ్రమములు నెలకొల్పబడెను. ఆంధ్రరాష్ట్రములోనే యనేక ఆశ్రమములు బయలుదేరెను. యువకులనేకులీ యాశ్రమములలో జేరు

చుండిరి. ప్రజాప్రబోధము చేయుచుండిరి. దేశభాషలలో ననేక వారపత్రికలు బయలుదేరెను. హూణవిద్య నభ్యసించి యింగ్లీషు రాని తల్లిదండ్రులకు నక్కసెల్లెండ్రకు తెలుగులో నాలుగుముక్కలు వ్రాయలేక ఇంగ్లీషులోనే యుత్తరములను 'దంచు' చుండిన యనేకమంది విద్యార్థులు గ్రామముల లోనికివచ్చి సగము తెలుగుతోను సగముఇంగ్లీషుతోను మాట్లాడుచు నెట్లో బయట పడెడివారు. పట్టాభిసీతా రామయ్యగారు, ముట్నూరి కృష్ణారావుగారు వంటివారు మాత్రమే తెలుగుప్రజలకప్పుడు పూర్తిగా తెలుగునమాట్లా డగల ప్రతిభకలవారు.

కాంగ్రెసులక్ష్యమును గురించికూడ తీవ్రమైన చర్చలు జరి గెను. వీలున్నచో బ్రిటిషుసామ్రాజ్యముక్రింద వీలులేనిచో బ్రిటిషుసామ్రాజ్యమును త్రోసివేసి స్వరాజ్యమును సంపా దించుటకు ఈరెంటకిని యవకాశముండునట్లు మహాత్ముడొక చట్టము తయారుచేసెను. జిన్నా, పండితమాలవ్య మొదలగు పక్షమువారు బ్రిటిషుసామ్రాజ్యము క్రిందనే స్వరాజ్యమును సంపాదింపవలెననిరి. కానివీరికంతగా వోట్లురాలేదు.

ఈ చట్టములో మరియొక షరతు కలదు. స్వరాజ్యమును శాంతియుతము, చట్టసమ్మతమున పద్ధతులుద్వారా సాధింప వలెనను నియమ మేర్పరుపబడెను. దీనికి కూడ తీవ్రమైన వ్యతిరేకాభిప్రాయముండెను. లక్ష్యము ప్రధానము కాని మార్గము, సాధన ప్రధానములు కావు. ఫలమునుబట్టియే

విధానము న్యాయవంతమగును. విధానమునకు లేనిపోని పవిత్రత యుండనక్కరలేదు. అను వాదము బలవత్తరముగ నుండెను. ఇది సామాన్యముగ నంగీకరింపబడు వాదము. మహాత్ముని వాదము క్రొత్తది. రాజకీయములలో నసలు పనికి రాదనువట్టిది. కాని మహాత్ముని యచంచల విశ్వాసము ముందర, నిరుపమ ప్రబోధముముందర ప్రజల యనుమానములు మంచువిడినట్లు విడిపోయెను.

ప్రపంచములో నింతవరకు సాంప్రదాయికముగ ననుసరింపబడుచుండిన దౌర్జన్య సిద్ధాంతమును మహాత్ముడు విడిచిపెట్టెను. బహిరంగముగనో రహస్యముగనో కత్తి, తుపాకి, మరఫిరంగితో శత్రువు నెదిరించి యోడించుట సభ్యమార్గము. ఈ మార్గమునకు పశుబల ప్రదర్శనమునకు స్వస్తిచెప్పి యంతకంటె స్థిరమైనది, యున్నతమైనది, జాతిని ప్రపంచమును పవిత్రము చేయునది, వ్యక్తిని గుర్తించునది యాత్మశక్తి నుద్దీపింప చేయునదియగు విధానమును మహాత్ముడు చూపెను.

ఇక హిందూమహమ్మదీయ యైక్యత అస్పృశ్యతా నివారణ, ఖద్దరుధారణ మొదలగు తీర్మానములు నాగపుర కాంగ్రెసులో నామోదింప బడెను. స్వరాజ్య సంపాదనకు సంఘసంస్కరణలతో సంబంధించిన యీసమస్యలతో పని యేమికలదు? వీటిద్వారా స్వరాజ్యము వచ్చునను వాదము చాలమందికి నచ్చలేదు. కాని మహాత్ముని విశ్వాసమో!

అదొకహిమాలయము. ఇవి స్వారాజ్యమును తేవచ్చును; తీసికొని రాజాలక పోవచ్చును. కాని యతని నాయకత్వమును కాదనకలవారు కాని మరొక మార్గమును చూపించి జాతి నంతను నడిపింపగల దక్షులు గాని లేరైరి. రాచకీయ పండితు లెంత వృధాతర్కము జరిపిననూ లాభ మేమి? అతని వ్యక్తిత్వము, సౌశీల్యము, త్యాగము, పోరాడగలదక్షత యెట్టివాదములకు కుశ్శంకలకు చోటీయలేదు. త్యాగ సాంప్రదాయ మేమాత్ర మున్నవారైన నతని వశమైపోయిరి.

బిపిన చంద్రపాల్, సురేంద్రనాధబెనర్జి, కపర్ది, మాలవ్య పండితుడు, పంజాబు సింహము, లాలాలజపతిరాయి, శ్రద్ధానందస్వామి, చిత్తరంజనదాసు, మోతీలాల్ నెహ్రూ ఎందరెందరో మహానుభావు లొక్కక్కరే యెట్టిదేశముకైనను చాలినవారు- ఆశ్చర్యచకితులైరి. "ఇంతటి యధికారముతో మాట్లాడగలిగిన యీ వ్యక్తి యెవరు? ఎందుండివచ్చినాడు" అను మాటయే ప్రతివానినోట బయలుదేరెను.

నాగపుర కాంగ్రెసులోనే కాంగ్రెసుయొక్క అంగనిర్మాణముకూడ చేయబడెను. కాంగ్రెసులో భాషాప్రయుక్త రాష్ట్రములు దీనినిబట్టియే నిర్మింపబడినవి. మహాసభలు జరుపుటకు రెండుమూడు రోజులుముందుగా విషయనిర్ధారణ సభసమావేశముకావలెను. అ. భా. కాం. సభ్యులు మాత్రమే దీనికి సభ్యులు. 15 మంది కార్యనిర్వాహక సభ్యులుగనుందురు. అందులోనే యధ్యక్షుడు కార్యదర్శులు,

కోశాధిపతి యుందురు. కాంగ్రెసు తీర్మానముల ననుసరించియే వీరు సంవత్సరముపొడుగున కాంగ్రెసు వ్యవహారములను నడిపించుచుందురు. దీనివలన కాంగ్రెసుకొక స్థిరరూప మేర్పడెను. కాంగ్రెసు కార్యకలాపములు జీవరూపము ధరించెను. నాగపుర కాంగ్రెసు నాటివాతావరణమును సూచించు యీక్రింది యితిహాసము గమనార్హమైనది.

కలనల్ వెడ్జివుడ్ (ఆంగ్లపార్లమెంటు సభ్యుడు) అధ్యక్షుని యనుమతిమీాద విషయనిర్ధారణ సభలో మాట్లాడుచు నాయకుల నిట్లుహెచ్చరించెను. "మీాచర్యలవలన మీారు మీాకు సహాయము చేయదలచుకొనిన వ్యక్తులపనిని కఠినతరము చేయుచున్నారు. మీాపని కనేక ఆటంకములు కల్పింపబడ గలవు. పోలీసులు నిమ్ముతరుముచుందురు. ప్లీడర్లు ప్రభుత్వము వారికి రాజభక్తి ప్రమాణములను చేయుదురు. కనుక వా రసహాయోద్యమములో చేరరు. మీారు అగాధములో పడిపోవుచున్నారు. ఇంతకంటె మీారు నిర్మాణకార్యక్రమములో నిమగ్నులగుట మంచిది."

అతడీ నీతివాక్యములను పలికి వేదిక దిగుటతోడనే యొక కంఠధ్వని యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను, "భారత దేశము వెలుపలనున్న మా మిత్రులను మే మెరుగుదుము. వారినిగురించి మే మెవరము పొరపడుట లేదు. మా మోక్షము మా చేతులలోనే యున్నది. మా భవిష్యత్తు మా బాగోగులు మామీాదనే యాధారపడి యున్నవి. మమ్మింకొకరు

బాగుచేయజాలరు చెరుపజాలరు. అట్టి జ్ఞానముతోనే మేమీ కార్యక్రమము నవలంభించితిమి. రహస్యభటుల సంగతి మేమెరుగుదుము. మేము వసూలుచేయు ప్రతిపైస ప్రచిన్న పాఠశాలకు చేసినను, వారికండ్ల యెదుటనే చేతుము. ఇది మా యనుభవము. లాయర్లు రాజభక్తి ప్రమాణముచేయవలెను. కనుకనే వారిపట్టాలను చింపివేయుచుంటిమి. మేము బుద్ధిపూర్వకముగనే యగాధములోని కురుకుచున్నాము. బానిసత్వమునుండి స్వర్గతుల్యమగు స్వాతంత్రమునకు తీసికొనిపోవు మార్గమెప్పుడునూ కంటకావృతమే, యగాధమే. అసత్యమునుండి సత్యమునకు, నంధకారమునుండి వెలుతురుకు మృత్యువునుండి యమృతత్వమునకు తీసికొనిపోగలిగిన యీ మహానాయకుని యందు మాకు సంపూర్ణ విశ్వాసమున్నది," వజ్రసన్నిభమైన యీ నవ్యభారతవాణి యసహాయోద్యమమునాటి భారతనిశ్చయమును వెల్లడి చేయుచున్నది.

ఈవాణివెనుక నశేషభారత ప్రజాకలకలము, నిరంతర కార్యకలాపము, సత్యాగ్రహ సమరపాండితీ ప్రభావము వెల్లువలై యావద్భారతము నిండి యగస్త్యుడు సముద్రము నాపోశనము పట్టినట్లు బ్రిటిషు ప్రభుత్వ రాజతంత్ర జలార్ణవము నిరువదియేడు వత్సరములలో పుడిసెము పట్టిన ఘట్టములనే రాబోవు యధ్యాయములలో మనము వినగలము.

---

సుజనరంజనీ ముద్రాశాల, రాజమంద్రి